# ఆంధ్రపత్రిక

317619



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 260 FRIDAY 23rd DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# ఆంధ్రరాష్ట్రం ఆర్థికదృష్ట్యా స్వయం సమృద్ధంగానే ఉండగలదు

## "దురాక్రమణప్రతిఘటనయత్నం రాజకీయకూటనిర్మాణం కాదు"

### అమెరికా విదేశాంగ విధానాన్ని వివరిస్తూ లాయ్ హెండర్సన్ ప్రసంగం

న్యూఢిల్లీ, డిసెంబరు 21: ఇండియాలోని అమెరికా రాయబారి లాయ్ హెండర్సన్ ఈవేళ ఇక్కడ విదేశసంబంధాల సంఘంలో మాట్లాడుతూ, అమెరికా ఏ రాజకూటమిలోను చేరలేదని అన్నారు. "దేశాలు పరస్పర సామరస్యంతో ఒక సంఘంగాఏర్పడి, దురాక్రమణలు జరగకుండా చూచినంత మాత్రాన అది ఒక రాజకీయకూటమి అయితే, అమెరికా అలాంటి కూటమికి చెందినదన డానికి అభ్యంతరం ఏమీలేదు. అమెరికా ఇతర రాజ్యాల సహకారంతోను, ఐక్యరాజ్యసమితి సాహాయ్యంతోను ప్రపంచంలో దురాక్రమణలు జరగకుండా చూస్తున్నది. అమెరికా చేసేపనులన్నీ ఐక్యరాజ్యసమితి ఆదర్శాలతోనే చేస్తున్నది. ఐక్యరాజ్యసమితినిదృఢపరచాలని కూడా అమెరికా తాత్పర్యము. అయితే దురాక్రమణదారులకు రక్షణలేని చిన్నచిన్న దేశాలను వదలివెయ్యడం మాత్రం చాలా అన్యాయమని అమెరికా భావిస్తున్నది. దురాక్రమణదారులతో ఈ విధమైన రాజీకి అమెరికా ఎంతమాత్రము సహించదు. ఇలాగ వదలివెయ్యడం కేవలము అవివేకమనీ, ఈ విధంగా ఏర్పడిన శాంతి అల్పకాలం నిలవదనీ అమెరికా భావిస్తున్నది," అని లాయ్ హెండర్సన్ స్పష్టపరిచాడు.

పండిత నెహ్రూ అమెరికాయాత్రను గురించి మాట్లాడుతూ లాయ్ హెండర్సను ఇల్లాగ అన్నారు. "పండితనెహ్రూ అమెరికా రావడంవల్ల ఇండియా అమెరికాల మధ్య స్నేహసంబంధాలు బాగా ఎక్కువైనాయి. ఇంకా మనస్నేహ సంబంధాలు ఎక్కువ కావలసిన అవసరంకూడా చాలా ఉన్నదని పండిత నెహ్రూ అమెరికా యాత్ర ఋజువు చేసింది."

లాయ్ హెండర్సన్ ఈ విషయంలో ఇంకా ఇలాగ అన్నారు. "ఇండియాలో అమెరికాను గురించీ, ఆదేశపు ప్రజలను గురించీ అపోహలు చాలా ఎక్కువగా ఉన్నాయి. పండిత నెహ్రూ అమెరికా వచ్చినప్పుడు భారతదేశవిధానాలు మార్చుకొనవలసిందని అమెరికా పండితనెహ్రూను కోరిందని ఇక్కడ చాలామంది భావిస్తున్నారు. ఈ అపోహ చాలా ఎక్కువగా అన్నట్లు కనిపిస్తున్నది. అందుచేతనే అమెరికావెళ్లినప్పుడు తాము ఏవిధమయిన రహ

(4-వ పేజీ చూడుడు)

### బ్రిటిష్ ప్రభుత్వ డాలర్ ఆర్జన

#### కొరత తగ్గినట్లు అమెరికా వాణిజ్యశాఖ ప్రకటన

వాషింగ్టన్, డిసెంబర్ 21: డాలర్ ప్రాంత వ్యాపారంలో బ్రిటనుకు తేవలు బాటు అవుతున్న డాలర్ల కొరతలో 780 లక్షలు తగ్గినదని అమెరికా వాణిజ్యశాఖ నేడు ప్రకటించింది. మిగిలిన స్టెర్లింగ్ ప్రాంతపు కొరతలో 1060 లక్షలు తగ్గినదనికూడా ఆప్రకటన తెలియజేస్తున్నది.

దీనికి కారణం అమెరికన్ ఎగుమతులు తగ్గటం కారణమని ఆప్రకటన ఉల్లేఖించింది.

బ్రిటన్ తనకు అమెరికా సప్లయిచేసే పెట్రోలు, క్రూడాయిల్ లలో, తన ప్రాంతంలో అమెరికన్ కంపెనీలు ఉత్పత్తి చేసే నూనెనే ముందుపంపి, ఆపైన అవసరమయితే అమెరికన్ నూనెను పంపవలసిందని నేడు కోరినది. ఈ పద్ధతివల్ల వాటి కోసం అవుతున్న డాలర్ల ఖర్చు చాలా భాగం—మొత్తం డాలర్ల ఖర్చులో 100$ ర కంటెలకు పైగా తగ్గిపోగలదు.

## "ప్రపంచ యుద్ధాలతో ప్రజలు విసుగెత్తి ఉన్నారు"

### శాంతి సఖ్యతలను అమెరికా అమూల్యంగా పరిగణిస్తున్నదని ట్రూమన్

వాషింగ్టను, డిసెంబర్ 21: నేడు అమెరికా అధ్యక్షుడు ట్రూమను అర్లింగ్టను నేషనల్ సిమెటరీ (సైనిక స్మశానం) లో ప్రపంచయుద్ధ నిహతులకు గౌరవార్థం ప్రసంగిస్తూ, ప్రపంచ ప్రజలు నియంతృత్వానికి ఉదాసీనత చెప్పి, భగవంతుణ్ణి ఆరాధిస్తేనే గాని శాశ్వతశాంతి చేకూరదనీ, మానవుడు స్వాతంత్ర్యంసంపాదించి భగవంతునిమైత్రి సాధిస్తేనేగాని యుద్ధభయం నుంచి విముక్తుడు కాడనీ అన్నారు.

"మానవజాతి యుద్ధంతో కుంగిపోయింది. రక్తపాతమూ, ఆకలీ, అనేక ఏళ్లుగా అనుభవించిన కష్టాలూ చూసి ప్రజలు విసుగెత్తిపోయి నారు. ప్రపంచ ప్రజాభిప్రాయం సమీకరించగలిగితే, మరొక యుద్ధం అసంభవమవుతుంది," అని ట్రూమన్ చెప్పారు.

అమెరికా సఖ్యాన్ని నిరసించే వాల వారు ఆమోదించేవరకూ అమెరికా ఆయుధబలాలను విసర్జించదని ఆయన వక్కాణించారు.

"అమెరికా మాత్రమే ప్రపంచ ప్రజాభిప్రాయ సమీకరణ చేయలేదు. అంధకారంలో ఉన్న అస్వతంత్ర ప్రజలు బయటికి వచ్చే వరకూ వారు స్నేహపూర్వకంగా మేము చాచే హస్తాన్ని చూడలేరు. వారు మా స్నేహాన్ని యుద్ధపు పిడికిలితో ప్రతిఘటించినంత కాలమూ మాకు రక్షణ సన్నాహాలు తప్పవు

"శాంతి సఖ్యతలను మేము అమూల్యంగా పరిగణిస్తున్నప్పటికీ, స్వాతంత్ర్యాన్ని ఇంకా అమూల్యంగా పరిగణిస్తున్నాము. ప్రపంచంలో అనేక మంది ప్రజలకు లేని విశ్వాసం భగవంతుడియందు మాకున్నప్పటికీనీ మేము ఆత్మ విశ్వాసం కూడా కలిగి ఉన్నాం.

"శాంతి రక్షించ బడవలసిన ఈ యుగంలో అతిక్రమణను మేము మా స్వబలంతో ఎదుర్కొనవలసి ఉంటుంది."

మార్షలు పథకం ఇతర విదేశ సహాయాలు గురించి మాట్లాడుతూ ట్రూమను, అమెరికా ధారాళంగా ఇతర దేశాలకు సహకులు అందివ్వడం చేత ప్రజా స్వామ్యంలో ప్రజలకు గురికుదిరిందన్నారు. అమెరికా కష్ట సమయంలో కాలు నిలువ దొక్కుకొని, స్వాతంత్ర్య కాముక దేశాలతో తమకున్నది పంచుకోవడం వల్లనే ఏనాటికైనా ప్రపంచ శాంతి సాధ్యం కావాలనీ, ఇదివరలో లాగే అమెరికా ధైర్యంతోనూ, వాస్తవిక దృష్టితోనూ తమ ప్రపంచ బాధ్యతలను నిర్వర్తించుకుపోయినంత కాలమూ శాంతికోరకు ఆశించే అధికారమూ, పాటుపడే అధికారమూ అమెరికా కుంటుందనీ ట్రూమను చెప్పారు.

## ఉన్న కొద్దిలోటు కేంద్రప్రభుత్వ ఆహార సబ్సిడీవల్ల భర్తీకాగల అవకాశం

### ఆర్థిక ఉపసంఘ నివేదికాంశములపై విభజనసంఘం సమగ్ర పరిశీలన

#### జనవరి మొదటివారంలో రాష్ట్ర నిర్మాణానికి సంబంధించిన యావత్తు వివరాలు కేంద్రప్రభుత్వానికి అందగలవని భక్తవత్సలంగారి ప్రకటన

చెన్నపట్నం, డిసెంబరు 22: చెన్నరాష్ట్ర విభజన సంఘంవారు నేడు ప్రధాని కుమారస్వామి రాజాగారి అధ్యక్షతను మంత్రివర్గ మందిరమున సమావేశమై ఉదయం 8 గం॥ నుండి 10-45 వరకు చర్చలు చేసిరి.

శ్రీ ప్రకాశం, వెంకట్రావు, గోపాలరెడ్డి, సంజీవరెడ్డి, కృష్ణమాచారి, భక్తవత్సలం, మాధవమీనన్ గారలు హాజరైరి. ఆర్థిక ఉపసంఘంవారి నివేదికపై నేడు కూడా చర్చ జరిగినట్లులను, వివిధ పాంశములు వరుసగా పరిశీలించుచున్నట్లునూ తెలియుచున్నది. చెన్నరాష్ట్ర మొత్తము రెవిన్యూలో 31%, ఆంధ్ర జిల్లాలనుంచి వచ్చుచున్నదని నివేదికలో తెలుపబడెను. అనగా చెన్నరాష్ట్ర ఆదాయం 58 కోట్లు అనగా ఆంధ్రజిల్లాల ఆదాయం సుమారు 17 కోట్ల 50 లక్షలు అగుచున్నది. ఒక కోటి 44 లక్షలు ఆంధ్రరాష్ట్రమునకు లోటు ఉండుననుచున్నారు. అనగాఆంధ్ర రాష్ట్ర ఖర్చు 18 కోట్ల 49 లక్షలు అగుచున్నది. ఆంధ్రరాష్ట్రము ఆహార ధాన్యములకు మిగులు రాష్ట్రమైనందువల్ల, మిగులు రాష్ట్రములకు కేంద్ర ప్రభుత్వమువారు ఇచ్చు బోనసుతో రాష్ట్రము స్వయం పోషకం కాగలదని ఆర్థికోపసంఘంవారి అభిప్రాయమై వున్నది. 1949-50 సం॥ మునకు చెన్నరాష్ట్రమునకు అయిదుకోట్లు గ్రాంటుక్రిందను, ఆరుకోట్లు ఋణము క్రిందను కేంద్రప్రభుత్వమువారు మంజూరు చేసినారు. ఆంధ్రరాష్ట్రము విడివడినప్పుడు జనాభా, ప్రాంతము, అవసరములనుబట్టి ఆంధ్రరాష్ట్రము వాటా ఆంధ్రరాష్ట్రమునకు రాగలదు. ఆంధ్రదేశము ఆర్థికముగా స్వయంపోషకముగా నుండగలదను చున్నారు. చెన్నపట్నంలో పెరిగిన ప్రభుత్వ భవనములకు ఆంధ్రులకు 40% ఇవ్వదరనియు, ఇది పుచ్చుకున్నంతమాత్రమున మద్రాసును ప్రత్యేకరాష్ట్రము చేయమని అడుగు హక్కుపోదని ఒక ఆంధ్ర

(4 వ పేజీ చూడుడు)

### ఆసియాలో అంతర్యుద్ధ బీజాలు

#### కోమిన్ ఫార్మ్ ప్రచారం: ప్రపంచ సోషలిస్టుల ఖండన

లండన్, డిశంబరు 21: రష్యన్ల అదుపాజ్ఞలలో నడుస్తున్న కోమిన్ఫారం ఆసియా దేశాలన్నింటిలోను అంతర్యుద్ధ బీజాలను వెదజల్లుతున్నదని అంతర్జాతీయ సోషలిస్టు మహాసభ తాలూకు ఉపసంఘం ఒక ఆరోపణ చేసింది.

## "సరిహద్దుసంఘ నియామకం ఇప్పటికి ఆపండి"

### సమ్మతిపై ప్రస్తుతానికి సరిహద్దులు నిర్ణయించుకోగలమని కేంద్రప్రభుత్వానికి విభజనసంఘ విజ్ఞప్తి

చెన్నపట్నం, డిసెంబరు 22: సరిహద్దుల నిర్ణయించుటకు ఇప్పుడు సరిహద్దు నిర్ణయ సంఘముతో నిమిత్తం లేదనియు, అనంతరము ఆ సంగతి చూసుకొనవచ్చుననియు, తమిళులూ, ఆంధ్రులూ పరస్పర స్నేహభావముతో సరిహద్దులను నిర్ణయించుకొనగలరనియు, బళ్లారి లోని ఆరు తాలూకాలను ఆంధ్రరాష్ట్రములో చేర్ప ఇష్టములేనిచో ఇటు మద్రాసునగాని అటు బొంబై రాష్ట్రమునగాని చేర్పవచ్చుననియు చెన్నరాష్ట్ర విభజనసంఘము వారు, మద్రాసు ప్రభుత్వమువారు కేంద్ర ప్రభుత్వమునకు వ్రాయుచున్నారని తెలియుచున్నది.

#### రాజధాని, హైకోర్టువిషయమై తమిళుల పట్టుదల

ఆంధ్రుల రాజధానీ, హైకోర్టు పెట్టుకొను చోటులగూర్చి తక్షణమే తెలుపవలెనని విభజన సంఘములోని తమిళ సభ్యులు వాదించుచున్నారు. జ్యూరిస్డిక్షనులేని ప్రాంతములో ఆంధ్ర హైకోర్టు ఉండదని వాదించు తమిళ నాయకులకు, సమాధానముగా, ఏ శాస్త్రములోను ఆటుల లేదనియు, ఒరిస్సా హైకోర్టు పాట్నాలో చాలా కాలమువరకు కలిసివుండెననియు, వెంటనే ఆంధ్రహైకోర్టును విడదీసుకు వెళ్ళమనుట న్యాయముకాదనియు, భవనములు ఇతరయేర్పాటులు జరుగువరకు ఆంధ్ర హైకోర్టు మద్రాసులోనే ఉండవలెనని ఆంధ్రనాయకులు వాదించుచున్నారు. ఇక రాజధానివిషయమై పేరుచెప్పుటకు రెండుమాసములవ్యవధి కావలెనని ఆంధ్ర నాయకులలో ఒకవర్గమువారి అభిప్రాయమైయున్నది. రాజధానివిషయమై పేరు ఎంతత్వరగా చెప్పిన అంతమంచిదని మునిగియగలదను ధోరణిలో తమిళనాయకు లున్నారు. జనవరి 5వ తేదీకి మద్రాసు అసెంబ్లీ సమావేశముగానున్నది. జనవరి నాల్గవ తేదీకి ఆంధ్రశాసనసభ్యుల, రాష్ట్ర కాంగ్రెసు సభ్యులసమావేశము జరిపి ఈవిషయమై తేల్చివేయుటయుంచిదని ఆంధ్ర నాయకులు యత్నములు చేయుచున్నారు. ముందు రాయలసీమశాసనసభ్యులు, రాష్ట్ర కాంగ్రెసు సభ్యులుకలసి హైకోర్టునో, రాజధానినో యావదాంధ్రదేశ క్షేమ దృష్ట్యా పరిశీలించి, వరించినప్పుడు, ఆ స్థలముల పేర్లనిర్ణయమును యావదాంధ్రదేశ శాసనసభ్యులు, రాష్ట్రకాంగ్రెసుసభ్యులు నిర్ణయించెదరు.

#### కామరాజనాడార్ అభిప్రాయం

చెన్నపట్నం, డిసెంబరు 21: జనవరి 26 వ తేదీకి రాష్ట్రము వచ్చు అవకాశము ఉన్నదా అని తమిళ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజనాడార్ గారిని ఆంధ్ర పత్రిక ప్రతినిధి అడుగగా రాజధాని విషయమై ఆంధ్రులు ఎంతసత్వరమూ తేల్చుకుంటె ఆ మరుక్షణంలో ఆంధ్రరాష్ట్రము రాగలదనిరి.

## ఐక్య ఇండొనీషియాకు అధికారప్రదానం

### శాసనంపై జూలియానారాణీసంతకం

హేగ్, డిశంబరు 21:—ఈవేళ హాలెండురాణి జూలియానా ఇండొనీషియాకు రాజ్యాధికారం సంక్రమింపజేసే చట్టంపై సంతకం పెట్టిందని తెలుస్తున్నది. ఈ చట్టం ఇంతకుపూర్వం మొదటి శాసన సభలో ఆమోదింపబడింది. దీనికి 34 గురు అనుకూలంగాను 15 గురు ప్రతికూలంగాను ఓటు చేశారు. రాజ్యాధికారం సంక్రమింప జేయ్యడంలో ఇది ఆఖరి లాంఛనమని తెలుస్తున్నది.

ఇండొనీషియా తరఫున రాజ్యాధికారం స్వీకరించడానికి ఇక్కడికి డాక్టరు మహమ్మదు హట్టా రాబోతున్నారు. అందుచేత ఈ రాజ్యాధికార ప్రదానోత్సవం రేపు మంగళవారంనాడు జరగ గలదని తెలుస్తున్నది.

హాలండు శాసన సభలో ఉన్న నలుగురు కమ్యూనిస్టులు ఈ చట్టానికి తమ వ్యతిరేకాభిప్రాయం తెలియజేశారు. కేథలిక్, లేబర్ పక్షాలు రెండూ ఈ చట్టానికి అనుకూలంగా ఓటు చేశాయి.

బటేవియాలో ఉన్న డచ్చి సేనలు జావా, సుమత్రాలలో ఉన్న ఓడరేవులలో కేంద్రీకరింప బడుతున్నవనీ, ఈ సేనలు త్వరలోనే హాలండుకు తరలింపబడ గలవనీ తెలుస్తున్నది.

ఇంకా మిగిలిన ఇండొనీషియా రేవులలో కూడా డచ్చి సేనలు తరలింప బడడానికి తయారుగా ఉన్నాయని తెలుస్తున్నది.

## పాతకొత్తఢిల్లీల వేర్వేరు పాలన

### పార్లమెంటులో నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, డిశంబరు 22: నేడు ఇండియా పార్లమెంటులో దేశబంధు గుప్త గారు అడిగినప్రశ్నకు సమాధానంగా భారత ప్రధాని పండిట్ నెహ్రూ నేడు పార్లమెంటులో ఇట్లు ప్రకటించిరి.

కొత్త ఢిల్లీ యొక్క పరిపాలనయును, పాతఢిల్లీ యొక్క పరిపాలనయున్ను వేర్వేరుగా నుంచవలెనని ఇండియా గవర్నమెంటు నిశ్చయించినది. పాతఢిల్లీతో బాటు ప్రభుత్వం ప్రకటించిన మరికొన్ని ప్రాంతములు చేర్చబడును. కొత్త ఢిల్లీకి మినహాగా మిగిలిన ప్రాంతమునకంతటికి ఒక కార్పొరేషను (నగర పాలకసభ) ఏర్పాటు కావలెను. ఈ కార్పొరేషనుకు లా అండ్ ఆర్డరు, న్యాయవిచారణ, ప్రజారోగ్యం, ఢిల్లీ విశ్వవిద్యాలయం, పోలీసు సంబంధించిన అధికారములు గాక తదితర అధికారముల నన్నింటిని కలిగియుండవలెను. ఈ ఏర్పాట్లను చేయుటకు వీలైనంత త్వరలో ఒక చట్టమును ప్రతిపాదించుటకు గవర్నమెంటు సంకల్పించియున్నది. కొత్త రాజ్యాంగచట్టం అమలులోనికి వచ్చేవరకున్న ఢిల్లీ విగూర్చిన ఏర్పాట్లకు చట్టమును ప్రతిపాదించుటకు వీలులేదు, లేదా ఇంకోవిధంగా ఏర్పాటు చేయువచ్చునని యీ పార్లమెంటుసభవారు నిర్ణయించవలెను. ఈ పార్లమెంటు సమావేశంలోనే యీ చట్టమును ప్రతిపాదించవలెనని తలచితిమి. కాని కొత్త రాజ్యాంగచట్టము చాలా ఆలస్యంగా పూర్తియైనది, అందువల్ల యీ ఆలస్యమైనది. ఈ పాత ఢిల్లీ కొత్త ఢిల్లీ విషయమై గవర్నమెంటు బాగా ఆలోచించిరి. ఈ రెండు ఢిల్లీల సంబంధం అపూర్వమైనది భారతదేశంలోని ఏ యితర రాష్ట్రంలోని అంతర్భాగంగా ఢిల్లీని పరిగణింప వీలులేదు కనుక ఢిల్లీని సంపూర్ణ స్వపరిపాలిత ప్రాంతంగాపరిగణించవలెను. అందులో, కొత్తఢిల్లీయొక్క సందర్భ పరిస్థితులను దానికి సంబంధించిన వ్యవహారములను ప్రత్యేకమైనవి. చాలామంది కాందిశీకులు ఇచటకు వచ్చి చేరిరి, వారి సంగతికూడా ఆలోచించాలి. ఇవన్ని ఆలోచించాలి. ఇవన్ని ఆలోచించి కొత్త ఢిల్లీకిన్నీ ప్రకటిత ప్రాంతములకున్ను ఒక ప్రత్యేక పరిపాలనా సంస్థను ఏర్పాటుచేయవలెను. మిగతా ప్రాతఢిల్లీ నగరప్రాంతమునకు ఒక కార్పొరేషను ఏర్పాటుచేయవలెను. కొత్తఢిల్లీలో ప్రభుత్వ కార్యాలయములు, విదేశరాయబారుల కార్యాలయములు, కేంద్ర ప్రభుత్వ ఆస్తులు ఉన్న వికనుక వీనికొరకు ప్రత్యేక పరిపాలనాధికారవర్గము వుండవలెను. ఈ కొత్త ఢిల్లీ పరిపాలక వర్గములోను, పాత ఢిల్లీ కార్పొరేషను తోను బాగు కలిపి వ్యవహారములను నిర్వహించగల అనుసంధాన కేంద్రాధికార వర్గముకూడా వుండవలెను.

# ఆంధ్ర సాంస్కృతిక నిధుల సంరక్షణ

## రాష్ట్రవిభజన సందర్భంలో నాయకుల బాధ్యత

### డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారి అభిప్రాయాలు

విజయవాడ, డిసెంబరు 20: ఆంధ్ర దేశమునకు ఒక సుస్పష్ట సాంస్కృతిక జీవనవ్యవస్థ ఇంతవరకు ఏర్పడలేదు. అట్టిది పరిణామదశలోనైనా ఉన్నట్లు కనపడుట లేదు. తెలుగువాటి ఉత్కృష్టశిల్పములు రాష్ట్రేతర సంస్థల అధీనముక్రిందకు నడచినవి. మిగిలిన శిల్పసంపదకు ఆలనాపాలనా లేదు. ఉన్న సాంస్కృతిక నిధులను పరిశీలించి, వివరించుటకు పీస్పృలేవు:—తల పెట్టినవారు లేరు" అని డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు ఒక సంభాషణలో నుడివిరి.

శ్రీనివాసాచార్యులుగారు ఇట్లనిరి. అమరావతి శిల్పములలో, శ్రేష్ఠమైనవి లండన్, పారిస్ నగరములకు తరలింపబడినవి. రెండవరకపు శిల్పములు కలకత్తా, బొంబాయి, మద్రాసులకు చేరవేయబడినవి. నేడు అమరావతిలోనున్న శిల్పశేషము, బౌద్ధశిల్ప చాతుర్యతకు చిహ్నముగా నెంచదగినదికాదు. మిగిలిన మన ఈ శిల్పనిధిని గవర్నర్లకు, యాత్రికులకు చూపినచో, అమరావతియాత్ర వృధాయని భావింతురు. అమరావతీక్షేత్ర ప్రాముఖ్యత పవిత్రతలే ప్రధానముగాగల యాత్రికునికి మాత్రమే కొంత తృప్తికలుగును. నేడు మద్రాసు మనదికాదని నాయకులు ఏదిగనో యొకవిధముగా తేల్చివైచిరి. ముందుముందు మన ఈ నాయకులు, మనరాష్ట్ర పరిపాలనను సాగింపనున్నారు. మన సంస్కృతిని పెంపొందించుటకు స్థైర్యముగా పూనుకొనుట—మనకు వారసత్వముగా లభించు చరిత్రను, సంస్కృతిని మరియు కరు మకకు కాకుండగా శాశ్వతముగా దక్కించుకొనకుండగా జాగ్రత్త వహించుట, నాయకులుగా ఎంచబడుచున్న వారు చేయవలసినపని.

ఆంధ్ర చారిత్రక పరిశోధనకు ఆధారమైనట్టి, చరిత్రకు అలంకారమైనట్టి వస్తుసంపదను ఆంధ్రదేశములోనే ఉంచవలెను. అమరావతి విషయము ఒక ఉదాహరణ మాత్రమే. అసలు, నేటికిని, ఆంధ్ర దేశములో అనేక చారిత్రక క్షేత్రములు అలక్ష్యము చేయబడుచున్నవి—వాటిప్రాముఖ్యము విస్మృతగహనమున పడుచున్నది. కనుపడిన చారిత్రకవస్తుసంపద ఆంధ్రప్రాంతపుటావలకు పోవుచున్నది—లేక కనుపడినందుకు తగ్గ అమర్యాదను పొందుచున్నది. అజ్ఞాతసంపద, లేనట్లే భావింపబడుచున్నది.

మద్రాసులోనే లిఖితప్రాచ్యభాషా గ్రంథనిలయములో తెలుగు గ్రంథములున్నవి. కన్నెమెరా లైబ్రరీలో తెలుగువారు భాగస్వాములు. మద్రాసుమ్యూజియంలో ఆంధ్రశిల్పములు అనేకమున్నవి. తంజావూరు సరస్వతీమహాల్‌లో తెలుగు లిఖితగ్రంథములెన్నియో యున్నవి. విచారకరవిషయమేమనగా, దేనినీ తెలుగుదేశము ఉపయోగించుకొనలేదు! పైగా లండన్‌లోని ఇండియా లైబ్రరీలో బ్రౌన్‌దొరగారు సేకరించిన లిఖితగ్రంథములు చేర్చబడియున్నవి. అవిలండన్‌లో ఉండుట ఎందులకు? మనమంత్రులు ఈవిషయము నాలోచింపవలెను.

ఆంధ్రప్రాంతమున కొక చారిత్రకవస్తు ప్రదర్శనశాల, ఒకపురాతన గ్రంథనిలయము, ఒకపెద్దలైబ్రరీ అత్యవసరము. నేడు ఆంధ్రతమిళ విభజనలలో, మనపురాతనవస్తు, గ్రంథసంపదను మనకొరకే ప్రత్యేకింపవలసినదిగా, విద్యాశాఖా డైరెక్టర్ విభజనసంఘమునకు తెల్పుట అవసరము.

ఈసంస్థలను ఆంధ్రదేశమునందు ఏప్రాంతములోనుంచుట బాగుండును అని అడుగగా, "అవి, ఆంధ్రదేశములో నుండవలెను. ఏ ప్రాంతము అనువిషయము సాంస్కృతిక చర్చకు వస్తువుకాజాలదు. అదియే రాజకీయములకు, సంస్కృతికి భేదా" అని ఆచార్యులుగారు సమాధానమిచ్చిరి.

ఇండియన్ రిపబ్లిక్ జేపీ అనవలెనని కూడా చెప్పిరి. సి. హెచ్. దత్తుగారి వందనసమర్పణతో గోష్ఠి ముగిసెను.

## చిత్రకారుడు భాగీరథి మరణమునకు సంతాపం

ప్రఖ్యాత ఆంధ్రచిత్రకారుడు వి. వి. భాగీరథిగారి మరణమునకు సంతాపమును తెల్పుచూ నిన్న సాయంత్రము విజయవాడ నవ్యకళా పరిషత్తువారు డి. వి. కృష్ణయ్య అధ్యక్షతక్రింద సమావేశమై తీర్మానించిరి. పురాణం సుబ్రహ్మణ్య శర్మ, భాగీరథి జీవితమునుగూర్చి ప్రసంగించిరి.

## విజయవాడ కార్మిక కాంగ్రెసు

విజయవాడ, డిశంబరు 19: ఈ నగర కార్మిక కాంగ్రెసు సంఘము నిన్న సాయంత్రము ఇవటూరి కోటేశ్వరరావుగారి అధ్యక్షతను సమావేశమై, జనవరి మాసములో, కార్మిక కాంగ్రెసు మహాసభను ఇచట జరుపుటకు తీర్మానించిరి. ముదిమ్మనేని వెంకట్రామయ్యగారు కన్వీనర్‌గా ఒక ఆహ్వానసంఘ మేర్పడెను. మురపిళ్ల చిట్టి, బసవరాజు శ్రీరంగశాయి, పి. వెంకటసుబ్బయ్య, మహమద్ సైయద్ జమాల్, సులేమాన్, మొదలైనవారు, కార్మికులందరునూ ప్రభుత్వమునకు అండగా నిలచి, దేశ పునర్నిర్మాణమునకు పూనుకొనవలెననియు, కార్మికు లందరునూ కాంగ్రెసులో చేరి పని చేయవలెననియు, ఉపన్యసించిరి.

### అరండల్‌పేట లేబర్ కాంగ్రెసు

భారతదేశము సంపూర్ణ స్వాతంత్ర్యమును ప్రకటించుకొను దినమైన జనవరి 26 నాటికే ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగుట సమంజసముగా నుండునని ప్రభుత్వమునకు సూచించుచూ, నిన్న అరండల్‌పేట లేబర్ కాంగ్రెస్ సంఘము జనాబ్ సైయద్‌జమాల్ అధ్యక్షతక్రింద సమావేశమై తీర్మానించెను. విజయవాడను రాజధానీ నగరముగా చేయవలెనని కూడా తీర్మానించిరి.

కార్మికులందరునూ కాంగ్రెసులో చేరవలెనని మహమద్ సులేమాన్‌గారు ఉపన్యసించిరి. తుపాను, వరద బాధితులకు, కార్మిక ప్రతినిధిగా మురపిళ్ల చిట్టిగారు చేసిన సేవల నభినందించుచూ ఒక తీర్మానము చేసిరి.

### ఆంధ్ర సినీ ఉద్యోగుల మహాసభ

ఈ నెల 25-26 తేదీలలో ఆంధ్ర సినీ ఉద్యోగుల సంఘపు నాల్గవ వార్షికసభ విలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయములో జరుగును. జి. కామరాజుగారు అధ్యక్షుడుగ, పుల్లాడి ఫణిభూషణరావుగారు కార్యదర్శిగ ఒక ఆహ్వానసంఘము ఏర్పడెను.

## ప్రభుత్వోద్యోగులు రేస్‌క్లబ్‌లలో పనిచేయరాదు

మదరాసు, డిసెంబరు 21: ప్రభుత్వోద్యోగులు రేస్‌క్లబ్ స్టూవర్టులుగాగాని కార్యనిర్వాహకులుగా వుంటుటను నిషేధించుచూ ప్రభుత్వము వుత్తర్వు చేసెను.

## ఆంధ్రప్రాంత సముద్ర తీరానికి కొత్త పేరు

### గుమ్మిడిదల సుబ్బారావుగారి సూచన

ఆంధ్రప్రాంతపు సముద్రతీరమునకు సింధుసాగరమని పేరుపెట్టవలయుననియు, విశాఖపట్నములో భవిష్యత్తులో నిర్మింపబోవు ప్రథమనౌకకు "యజ్ఞశ్రీ" అని పురాతన ఆంధ్రచక్రవర్తి పేరు పెట్టవలెననియూ, గుమ్మిడిదల వెంకటసుబ్బారావుగారు ఇచట మొన్న జరిగిన "సేవ్ డే" సందర్భమున విద్యార్థిగోష్ఠిలో సూచించిరి. అధ్యక్షతవహించిన క మధుసూదనరావుగారు విద్యార్థులందరు శరీరపరిశ్రమను చేయుట, నేయుట నేర్చుకొనవలెననిరి. సుబ్బారావుగారు తమ ప్రసంగంలో యజ్ఞశ్రీ నాణెముల చిహ్నములను, నేటి నాణెములపై భారతప్రభుత్వము ఉపయోగింపవలెననిరి. జనవరి 26 నుండి రాయల్ ఇండియన్ నేవీ అనబడునట్లు,

## కృష్ణాపెన్నార్ ప్రాజెక్టు

### ఇంతవరకూ జరిగినపని: పబ్లిక్‌వర్క్సుమంత్రి వివరణ

మదరాసు, డిశంబరు 20: పబ్లిక్‌వర్క్సు మంత్రి శ్రీ భక్తవత్సలంగారు నేడు అసెంబ్లీలో శ్రీనివర్తి వెంకటసుబ్బయ్యగారికి జవాబు ఇచ్చుచూ కృష్ణా పెన్నారు ప్రాజక్టు నిర్మాణసందర్భమున జరిగినపనిని వివరించిరి.

కృష్ణా, పెన్నారులమీద రిజర్వాయర్లు డాముల నిర్మాణ ప్రాథమికచర్యలు చాలవరకు పూర్తి అయినవి. నమూనాలు తయారుచేయుటకు అవసరమైన సమాచారము సేకరించబడినది. డ్రిల్ వర్క్సు మొదలైనవి మరి కొంతకాలము జరుగును. మిట్టకొండలగుండా రెండురిజర్వాయర్లను కలుపు కాలవ, పెన్నారుముఖమునగల కాలవ పూర్తి అయినవి. కొన్ని చిల్లరపనులు 1950 జూన్ వరకు జరుగుతూనే వుండగలవు. పెన్నారు వుత్తరకాలవపని ఇప్పుడే ప్రారంభమై 28మైళ్లవరకు వచ్చినది. ఈపని 1950 ఏప్రిల్ వరకు జరుగవచ్చును. మొత్తముమీద పరిశీలన అంతా 1950-51 కి పూర్తికావచ్చునని అనుకుంటున్నాము. పరిశీలన పూర్తి అయినవెంటనే స్కీమును మంజూరుచేయు విషయం పరిశీలించెదమని పబ్లిక్‌వర్క్సుమంత్రి జవాబులో తెలిపిరి.

శ్రీనివర్తి: నంది కొండలనుండి వచ్చే కంచలమ్మకాల్వ విషయముకూడా పరిశీలనలో చేర్చినారా?

మ: అదికూడా పరిశీలించబడుచున్నది.

శ్రీనివర్తి: కడపజిల్లా గండికోట ప్రాజెక్టుకు కృష్ణానీరు వచ్చుటకు వీలుగా మార్చబడుచున్నమాట నిజమేనా?

మ: అవును.

శ్రీ పి వి. సుబ్బయ్య: రాయలసీమ ఆర్థికాభివృద్ధికి తోడ్పడు ఈ స్కీమును శీఘ్రముగా కొనసాగింపెదరా?

మ: సాధ్యమైనంతవరకు పరిశీలనను శీఘ్రతరముచేశినాము.

## రాష్ట్రంలో పశువుల కేంద్రములు

మదరాసు, డిశంబరు 21: రాష్ట్రములో ప్రస్తుతము నాలుగు పశుకేంద్రము లున్నవని వ్యవసాయమంత్రి నేడు అసెంబ్లీలో తెలిపిరి.

అవి సేలంజిల్లా హోసూరు, గుంటూరు జిల్లా లాము, బళ్లారిజిల్లా హరుకుప్పి, విశాఖపట్నం జిల్లావాత్తేరులలో వున్నవనియు, రెండుగూడు జిల్లలకు కలిపి ఒక పశుకేంద్రము స్థాపించుట ప్రభుత్వవిధానమనియు, మలబార్ జిల్లాకు ఒక పశుకేంద్రమును మంజూరు చేయబడినదనీ కర్నూలు, ద. కనరాజిల్లాలలో పశుకేంద్రముల స్థాపించు విషయము ఆలోచనలో వున్నదని కూడ మంత్రిగారు తెలిపిరి.

### జూదముల చట్టము

ప్రభుత్వము మదరాసు సిటీపోలీసు జూదముల (సవరణ) చట్టము శక్షను 2, 4 లను 1951 ఏప్రిల్ 1 నుండి అమలు జరుపుటకు నిశ్చయించినదని మంత్రి భక్తవత్సలం నేడు, అసెంబ్లీలో తెలిపిరి.

### ఖద్దరుకు ప్రోత్సాహం

మ్యునిసిపాలిటీలోని లోయర్ గ్రేడ్ సిబ్బందికి ఇకరులకు ఖద్దరు వస్త్రములనే సప్లయి చేయవలెనని వుత్తర్వు లిచ్చినట్లు నేడు అసెంబ్లీలో స్థానికపాలనమంత్రి శ్రీ చంద్రమౌళిగారు ఒక ప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

కొన్ని మ్యునిసిపాలిటీలు మిల్లుబట్ట కొనుటకు అనుమతి ఇవ్వవలసినదిగా కోరినవనియు అయితే గృహపరిశ్రమల అభివృద్ధికి ఖద్దరును ప్రోత్సహించవలెనని కూడ మంత్రిగారనిరి.

# 'చిత్తూరు జిల్లా పూర్తిగా ఆంధ్రరాష్ట్రంలోనే చేరాలి'

## పుత్తూరుతాలూకా కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం

నగరి, డిశం॥18:—పుత్తూరు తాలూకా కాంగ్రెసు కార్యవర్గ సమావేశము నేడు పుత్తూరులో ఇ స్వామినాయుడు గారి అధ్యక్షతను జరిగెను. తాలూకా ఎన్నికోద్యోగిగా, తా॥ కాం॥ అధ్యక్షుడిని నిర్ణయించుతూ, అవసరమైనప్పుడు ప్రత్యేక పుద్యోగులను నిర్ణయించు అధికారము కూడ ఆయనకిస్తూ, ఒక తీర్మానం చేశారు.

ఆంధ్రరాష్ట్రము:—చిత్తూరు జిల్లా విషయమై ఈ దిగువ తీర్మానం చేశారు:

"అఖిల భారత కాంగ్రెసు సంఘం వారిచే అంగీకరింపబడి, అమలులోయున్న ప్రకారం, చిత్తూరుజిల్లా పూర్తిగా ఆంధ్రరాష్ట్రములోనే చేరవలెనని కోరుచున్నాము. ఇందుకు వ్యతిరేకముగా ప్రచారములు చేయువారి అక్రమ చర్యలను యీ సంఘమువారు ఖండించుచూ, వారి కోరికలు క్రమ బద్ధమైనవి కావని ప్రభుత్వమునకు విన్నవించుచున్నాము. గాంధీగారి ఆదేశానుసారము ప్రప్రథమమునుండి మదరాసులోనున్న ఆంధ్రజిల్లా కమిటీని అంగీకరించియున్నారు. ప్రస్తుతము ఆంధ్రనాయకులు కొందరు నూతన రాజ్యాంగ చట్టము ప్రకటించుటలో ఆంధ్రరాష్ట్రము ప్రత్యేకముగా పొందుపరచుటకై అరవలు కోరే అన్ని కోరికలకు లొంగిపోతూ మదరాసును వదలుకోవడము న్యాయ సమ్మతము గాదు అట్లు ఆంధ్రరాష్ట్రము నుండి మదరాసును విడదీసే పక్షములో ఆస్థానిని ప్రత్యేక రాష్ట్రముగా విభజింప కోరుచున్నాము."

తర్వాత జమీందారీ రద్దుచట్టము అమలు జరుపక పోవడంవల్ల జమీందారీ ప్రాంతంలోని రైతులకు చాలా బాధలు కలుగుచున్నవని, కావున ప్రభుత్వము వెంటనే ఎస్టేట్లను స్వాధీనపరచుకొని రైతులబాధలు తొలగించాలని, ఒక తీర్మానం చేశారు.

ప్రభుత్వము చేయు చట్టముల ద్వారా ధాన్యం, గూడ్సులలో రైతులకు ఇబ్బంది కలిగించునట్లు ఉండకుండా చేయవలెనని కూడా ఒక తీర్మానం చేశారు.



## కీ. శే. ద్వారంపూడి రామారెడ్డిగారు

తూర్పు గోదావరి జిల్లా అనపర్తి గ్రామ వాస్తవ్యులును, సుప్రసిద్ధులైన శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు 9-12-49 తేదిని రాజమండ్రిలో దివంగతులైనారు.

వీరి దానధర్మాదులచేతను ఔదార్యాదర గుణములచేతను స్నేహభావముతోను, ఉన్నతోద్యోగస్థులతో విశేష స్నేహము గలిగి, వారిచే గౌరవాభిమానములను, బీదలచే ప్రేమాదులను బడయుచుండెడివారు. ఆదినుండియు జాతీయసంస్థలయం దభిమానము గలిగి కాంగ్రెసు వాదియై తూర్పుగోదావరి జిల్లాబోర్డు యందు చిరకాలము సభ్యులుగ నుండి, నిరంతర ప్రజాసేవ తత్పరులై యుండెడివారు. వేటయందు నిపుణత, టెన్నిస్ ఆటయందు ప్రాముఖ్యత, గుర్రపు స్వారీయందు, యితర పోటీ పందెములయందును అమితోత్సాహము గలిగి పెక్కు స్నేహితులను ఆకర్షించిరి.

వీరు అనేకసంస్థలను స్థాపించిరి. వీటిలో ముఖ్యమైనది, పౌరులవద్దను, ఇతర ప్రముఖుల వద్దను విరాళముల నందుకొని జిల్లా బోర్డు వారిచే స్థాపింప చేయించి వారి పేరున నను ప్రస్తుతము అభివృద్ధిలో నున్న అనపర్తి బోర్డు హైస్కూలు. వీరి నిరంతర కృషి ఫలితముగాను, అనపర్తి చుట్టు ప్రవహించుచున్న కాలువలపై రెండు వంతెనలు కట్టబడినవి.

ఇట్టివారి మరణమునకు విశేష స్నేహ, బంధువర్గములును, అశేష జిల్లా గ్రామ పౌరులును సంతాపించిరి. వారి యాత్మకు భగవంతుడు శాంతి ప్రసాదించు గాక.

వారి స్నేహ, బంధువర్గము,
అనపర్తి.

---



# కంట్రోళ్ల అమలును గురించి సమగ్ర విచారణ జరగడం అవసరం

## అధినివేశ శాసనసభలో సభ్యుల సూచన: ప్రధానవస్తువులపై మరో ఏడాదివరకు కంట్రోళ్లు

న్యూఢిల్లీ, డిసెంబరు 21: నేడు భారత శాసనసభలో అధికార బిల్లులపై చర్చ జరిగెను. దివాకర్ గారి సినిమ టాగ్రఫిక్ చట్ట సవరణబిల్లు కొద్ది చర్చ జరిగిన అనంతరం ఆమోదింపబడినది.

తరువాత ఢిల్లీ భవనాల సేకరణ, నిర్వాహణ (1947) చట్టాన్ని 1952 దాకా పొడిగిస్తూ గనుల మంత్రి ఎన్. వి. గాడ్గిల్ బిల్లు ప్రతిపాదిస్తూ యీ విధంగా చెప్పారు: ఆగస్టు 31 న ఈ సందర్భంలో జారీ చేయబడిన ఆర్డినెన్సుకు యీ నెలతో గడువు తీరుతుంది. ఢిల్లీలోనూ, పరిసరాలలోనూ ఇళ్ల ఎద్దడి తీవ్రంగా ఉన్నది. అందుచేత ప్రస్తుతం అములులో ఉన్న చట్టాన్ని మరి రెండేళ్ళు అమలు చేయాలి. ఇప్పటివరకు దేశరక్షణ నిబంధనలకింద 369 ఇన్స్యూ, 1947 చట్టం కింద 81 ఇన్స్యూ సేకరించబడినవి. ప్రభుత్వ కచేరీలకు మాత్రమే 1,70,000 చదరపుఅడుగుల స్థలం కావాలి. 13 వేల మంది ప్రభుత్వోద్యోగులకు ఇళ్లు లేవు. వీరిలో 5 వేలమంది కాందిశీకులు.

కేంద్రప్రభుత్వంలో పనిచేసే కాందిశీకులలో 7,492 మంది ఇళ్ళకొరకు అర్జీలు పెట్టుకొన్నారు. అందులో 2,102 మందికి ఇళ్ళు చూపబడినవి. ఇళ్ళు దొరికిన ఉద్యోగులు ఇళ్ళు లేనివారికి తమఇళ్ళలో కొంతభాగం కాందిశీకులకు మళ్ళీ అద్దెకివ్వవచ్చునని ప్రభుత్వం ఆమోదించడం వల్ల 6816 మందికి ఇళ్ళు దొరికినవి. ప్రస్తుతం 3,200 యూనిట్లు నిర్మాణంలో ఉన్నవి. ఇందులో 2000 భాగాలు గుమాస్తాలకు ప్రత్యేకించబడలవి. 1,200 యూనిట్లు పై మాసంలోనూ, మిగిలినవి 1950 మార్చి ఆఖరుకూ సిద్ధమవుతవి. పురపాలకశాఖవారు 4000 యూనిట్లు కడుతున్నారు.

ప్రభుత్వఆధీనంలోవున్న 1889 యూనిట్లలో శరణార్థులు అక్రమంగా ప్రవేశించి ఉన్నారు. ఢిల్లీ మొత్తం మీద 2957 ఇళ్ళలో అక్రమ ఆక్రమణ జరిగింది. 7833 మందికి ఇళ్లులేని సమయంలో ఈ పరిస్థితులు సాగనివ్వరాదు. 1950 మార్చిలోగా 1889 మందిని ప్రభుత్వంవారు ఇళ్లలోంచి ఇళ్ల గొట్టి వారికి ఇతర నివాసాలు సాధ్యమైన వరకు చూపదలిచారు. ప్రభుత్వంకింద ఉన్న ఇళ్లలో అనేకులు ప్రవేశించడం వల్ల 8 లక్షల రూపాయల అద్దె బకాయి పడింది. విదేశాల ప్రతినిధి వర్గాలకు నివాసాలు చూపవలసిన బాధ్యతకూడా ప్రభుత్వంమీద ఉన్నది. ఆ కారణంచేత సభవారు ఈ బిల్లును ఆమోదించాలి.

దేశబంధు గుప్తా బిల్లును తీవ్రంగా ప్రతిఘటించారు. ఈ బిల్లు అనవసరం. ఇళ్ల సేకరణచట్టం మరోక సంవత్సరం పొడిగించవచ్చు. అది సాధ్యం. కాకపోతే ఈ బిల్లు కొత్తగా కట్టే ఇళ్లకు వర్తించకుండా చూడాలి. జాతీయప్రభుత్వం ఆర్డినెన్సులు జారీచేస్తూ ప్రజాభిప్రాయాన్ని పాటించడంలేదు. ప్రభుత్వం సేకరించి సీళ్లు వేసిన ఇళ్లు ఎన్నో నిరుపయోగంగా ఊరికే ఉన్నవి. ఇళ్లసేకరణ చట్టం సరిగా అములు జరగడంలేదని ఢిల్లీ కమిషనరే అన్నారు. కొత్తగా ఇళ్లు కట్టడానికి ప్రజలు భయపడుతున్నారు. ఇళ్ల సమస్యను ప్రభుత్వం ఏ విధంగా పరిష్కరించేదీ చెప్పాలి. అనేక వేలమంది కాందిశీకులు రోడ్ల పక్కనా గుడిసెలలోనూ నివసిస్తున్నారు. వారి స్త్రీలు అవినీతికి దిగుతున్నారు.

జస్పత్ రాయ్ కపూర్ బిల్లును ఆమోదిస్తూ, ప్రభుత్వంవారు శరణార్థుల నిమిత్తం కూడా ఇళ్లు సేకరించాలనీ, అక్రమంగా ఇళ్లు ఆక్రమించిన కాందిశీకులను వెళ్ళగొట్టక పూర్వం వారికి ఇతర నివాసాలు ఏర్పరచాలనీ, ప్రభుత్వంవారు తగినంతగా గృహ నిర్మాణం సాగించడంలేదనీ, అవి వారికి సాధ్యం కాకపోతే ఇతరులకైనా అవకాశం ఇవ్వాలనీ అన్నారు.

తిరుమలరావు మట్లాడుతూ ఇళ్ళ సమస్య చూడడానికి ఒకప్రత్యేకమంత్రి ఉండాలన్నారు. ప్రభుత్వం కిందఉన్న ఇళ్ళ యాజమాన్యంగురించి ఆయన ఒక ఉదాహరణ ఇస్తూ, తన మిత్రులొకరు ప్రభుత్వ భవనంలో కొద్దిరోజులుండి వెళ్లిన అనంతరం ఎవరోవచ్చి ఏడు మాసాలు ఆక్రమించుకొన్నందుకు ఎస్టేటు అధికారి తనవద్ద 800 రూపాయలు వసూలు చేశాడని చెప్పారు.

ఆర్. కే. సిధ్వా బిల్లునూ, ప్రభుత్వం వారి చర్యలనూ కొనియాడుతూ దేశబంధు గుప్తావలె ఢిల్లీలో ఇళ్లుగలవారు బిల్లును ప్రతిఘటించడం ఆశ్చర్యం లేదన్నారు.

ఎన్. వి. గాడ్గిల్ చర్చకు సమాధానం చెబుతూ, ప్రభుత్వంవారు సభ్యులు చేసిన సూచనలను గురించి ఆలోచిస్తారనీ, గృహ నిర్మాణ పదార్థాలు లేని కారణంచేత గృహ నిర్మాణం చురుకుగా సాగడం లేదనీ, కాందిశీకులకొరకు కూడా ఇళ్లు సేకరించబడతవనీ, కొత్తఇళ్లు నిర్మించడానికి ఇళ్లు కట్టేవారితో ఆలోచనలు జరగగలవనీ అన్నారు.

బిల్లుయొక్క జీవితం 1955 వరకూ పొడిగించడానికి సిధ్వా చేసిన ప్రయత్నం విఫల మయింది.

ఎస్టేటు ఆఫీసుగురించి విచారణ జరగాలనీ, ఈ బిల్లు ఒక్క సంవత్సరమే అములులో ఉండాలనీ పంజాబురావు దేశముఖు అన్నారు.

జస్పత్ రాయ్ కపూర్ చేసిన రెండు సవరణలను గాడ్గిల్ ఆమోదించారు. బిల్లు ఆమోదించబడింది.

ఈసరికి సాయంకాలం 5-20 అయింది. కాలాతీతమయింది కనుక సభ ముగించాలని హృదయ నాథకుంజ్రూ కోరారు. 6-0 గంటలదాకా సభ సాగించడానికి నిర్ణయం జరిగిందని అధ్యక్షుడు చెప్పిన మాట కొందరు అవునన్నారు. కొందరు లేదన్నారు. కాని సభ సాగించడానికే నిర్ణయం జరిగింది కాని కొందరు సభ్యులు వెళ్లిపోవడంచేత కోరం లేకపోయింది. ఇంతలో జవహర్లాలు నెహ్రూ మొదలైనవారు రావడంచేత తిరిగి కోరం ఏర్పడింది.

అవసర సరఫరాల, భూసేకరణచట్టాన్ని ఒక ఏడాది పొడిగించాలని ప్రతిపాదిస్తూ డా॥ శ్యామప్రసాదముఖర్జీ, ఇది వివాదగ్రస్తమైన అంశం కాదనీ, దీనిని పొడిగించడం ఈచట్టంకింద ఇదే ఆఖరు సారి అనీ, ప్రస్తుతం కేంద్రానికుండే అధికారాలలో ఏవి నూతన రాజ్యాంగం కింద కేంద్రానికుండాలనే విషయంగురించి రాష్ట్ర ప్రభుత్వంతో మాట్లాడాలనీ, నూతన రాజ్యాంగం కింద కేంద్రంవారి కంట్రోలు విధానంతిరిగి నిర్ణయించబడాలనీఅన్నారు.

ఆచార్యరంగా లేచి కంట్రోళ్ళను గురించి ఈ విధంగా చెప్పారు: కంట్రోళ్లు ఏవిధంగా అములుజరుగుతున్నదీ విచారించాలి. కంట్రోళ్లు అములులోకి రాగానే దొంగవ్యాపారం హెచ్చి అవినీతిప్రబలింది. వస్తువులసరఫరా సహకారసంఘాల ద్వారా సాగించడానికి బదులుగా వర్తకులద్వారా జరుపుతున్నారు. కంట్రోళ్లు ఇంకా అయిదేళ్ళపాటు అములులోవుండవచ్చు కనుక విచారణ అవసరం.

కంట్రోళ్ళఫలితంగా దొంగవ్యాపారము లాభాపేక్ష ప్రబలి ప్రభుత్వం అపఖ్యాతిపాలయిందని ఆర్. కె. సిధ్వా అన్నారు. ఆహారంమీదా నిషేధస్థలాల మీదా తప్ప మరిదేనిమీదా కంట్రోలు అవసరంలేదు.

చౌదరీ రణబీర్ సింగు డా॥ ముఖర్జీ తీర్మానాన్ని బలపరిచారు.

డా॥ ముఖర్జీ చర్చ కీవిధంగా సమాధానం చెప్పారు.

ప్రభుత్వానికి కంట్రోళ్లపై వ్యామోహంలేదు. వాటిని మానాలనేఉన్నది. కాని ముందును యీ, 'జనుక గొయ్యియి ఉన్నది. ప్రభుత్వం కంట్రోళ్లు అములు చేసేటప్పుడు వారికి అధికారులూ, అనధికారులూకూడా సాయపడాలి. కాగితం, అభ్రకం మొదలైన వాటిపై కంట్రోళ్లు ఎత్తివేయబడినవి నూతన రాజ్యాంగం కింద నూతన రాజ్యాంగంలో కేంద్ర ప్రభుత్వం కంట్రోళ్ళను అములుచేయదు. యేవస్తువుపై కంట్రోళ్లు కేంద్రం అములుజరపాలో, రాష్ట్రాలు అములు జరపాలో నిర్ణయం కావలసి ఉంటుంది.

తీర్మానం నెగ్గింది. సభ రేపటికి వాయిదాపడింది.

## ప్రశ్నోత్తరాలు

### అస్సాంలోని ఖాసీ సంస్థానాలు

అస్సాంలోని ఖాసీ సంస్థానాలను, అస్సాం రాష్ట్రంలో ఒలీనం కాకపోయినా, ఆరాష్ట్రంలోని భాగంగానే పరిపాలించుతున్నాం. ఈ సంస్థానాధిపతులు భారత ప్రభుత్వానికి సామంతులుగా వుండటానికి అంగీకరించుతూ ఒడంబడికలు చేసుకున్నారు. యథాతథపు ఒడంబడికలుకూడా చేసుకున్నారు. వారి దర్బారులు యథాప్రకారంగా పనిచేస్తున్నయ్, ఆ సంస్థానాధిపతులను ఆయా సంస్థానాల అధికారులుగానే భారత ప్రభుత్వం గుర్తించుతున్నదని సంస్థాన శాఖామంత్రి సర్దార్ పటేలు ఈ వేళ పార్లమెంటు ప్రశ్నోత్తర సమయంలో తెలియచేశారు.

### జస్టిస్ చటర్జీ రాజీనామా

డాక్టర్ మన్‌మోహన్ దాస్‌గారు అడిగిన ఒక ప్రశ్నకు సమాధానం చెబుతూ హోంశాఖామంత్రి సర్దార్ పటేలు ఇలా తెలియజేశారు.

'కొత్త రాజ్యాంగంలో తెచ్చిన మార్పులు కారణంగా తన ఉద్యోగపరిస్థితిలో చాలామార్పులు యేర్పడినందుకు అసమ్మతిసూచకంగా కలకత్తా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ యస్. ఎ. చటర్జీ రాజీనామా దాఖలు చేశారు. 1949 నవంబర్ మూడవ తేదీన ఆయన తన రాజీనామాను పశ్చిమ బెంగాలు గవర్నరుకు అందచేశారు. గవర్నరు దీన్ని ఆమోదించారు.'

డాక్టర్ దాస్: ఇంకా రాజీనామా లిచ్చినవారెవరైనా వున్నారా?

పటేలు: లేదు.

తిరుమలరావు: క్రొత్త రాజ్యాంగంలోని షరతులవల్ల యిబ్బందులున్నట్లు విజ్ఞప్తులేమైనా వచ్చినాయా?

పటేలు: లేదు.

# అంతర్జాతీయ గోధుమ ఒప్పందం వివరాలు

## పార్లమెంటులో దౌలత్రాం ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబర్ 21: "అంతర్జాతీయ వాణిజ్య ఒడంబడిక ననుసరించి ఇండియా 10,42,000 టన్నుల గోధుమను తప్పనిసరిగా తెప్పించుకోవాలి. అయితే ఒడంబడికలో చెప్పబడిన కనీసపు రేటుకు ఇస్తేనే మనం తప్పనిసరిగా తెప్పించుకోవలసిఉంటుంది. ఒడంబడికలో పాల్గొన్న ఆస్ట్రేలియా, అమెరికా, కెనడా, ఫ్రాన్స్ యునైటెడ్‌లలో దేనినుంచయినా మనం తెప్పించుకోవచ్చును." అని భారతఆహార మంత్రి జైరాందాస్ దౌలత్రాం నేడు పార్లమెంటులో ఒక ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించాడు.

ఒడంబడిక 1949 ఆగస్టునుంచి 4 సంలవరకూ అమల్లో ఉంటుందని ఆయన తెలియజేశాడు.

మహావీర్‌త్యాగి:- ప్రస్తుత ఆధికాహారోత్పత్తి కార్యక్రమాన్ననుసరించి దిగుమతులు అవసరంలేకుండా పోయినప్పుడు కూడా గోధుమను దిగుమతి చేస్తారా?

దౌలత్రాం:- కనీసపురేటు ఉంటే మనం దిగుమతి చేయకతప్పదు. అప్పడయినా అది నిలవను ఏర్పాటు చేయటానికీ, అవాంతర పరిస్థితుల్లోనూ దేశంలో ధరలు తగ్గించటానికీ ఉపయోగిస్తాము.

"ఇంతవరకూ ఒడంబడికకింద కొనుగోలేమీ చేయలేదు. 1949 ఆగస్టు తరవాత మనంచేసిన గోధుమ దిగుమతి అంతా ఆస్ట్రేలియా నరుకే. దానిని ఒడంబడిక కింద సప్లయిచేసినట్లుగా పరిగణించాలని ఆస్ట్రేలియాతో సంప్రదింపులు జరుపుతున్నాము. పౌను మారకపురేటు మార్పువల్ల ధరను 100 కి 44 వంతులు పెంచాలని ఆస్ట్రేలియా ప్రయత్నిస్తున్నది. ధరను తగ్గించమని మనం సంప్రదిస్తున్నాము." అని ఆయన తెలియజేశాడు.

## ఇండియన్ యూనియన్‌కు హిందీపద నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబరు 21: ఇండియన్ యూనియను పదాన్ని హిందీభాషలో ప్రకటించడానికి ప్రభుత్వం ప్రయత్నాలు చేస్తున్నట్లు శ్రీ జయరాందాస్ దౌలత్‌రాం నేడు పార్లమెంటుకు నివేదించారు.

ఇండియా పైశాల్యం మొత్తం 12 లక్షల చ॥మైళ్లు అని, ఇందులో 1 లక్ష 81 వేల చ॥మైళ్లు మాత్రం శాస్త్రీయంగా ఇంకా సర్వే చేయించవలసివున్నదని తెలియజేసారు.

## భారతదేశపు పత్రికలమీద పాకిస్తాన్ నిషేధాజ్ఞలు

'పాకిస్థాన్ ప్రభుత్వం, భారతదేశపు పత్రికలను మొత్తం 17 పత్రికలను నిషేధించింది. తూర్పు పాకిస్తాను 11 పత్రికలను నిషేధించింది; పశ్చిమ పాకిస్తాన్ 6 పత్రికలను నిషేధించింది. పాకిస్తాన్ పత్రికలు 7 మాత్రం భారతదేశంలో నిషేధించబడినై' అని సర్దార్ పటేలు ఈ వేళ సతీశచంద్రసామంతా అడిగిన ప్రశ్నకు సమాధానంగా తెలియజేశారు.

ఆర్. యస్. యస్. సత్యాగ్రహీలెవ్వరూ ప్రస్తుతం జైళ్లలో లేరు. ఆర్. యస్. యస్. సత్యాగ్రహోద్యమం ప్రారంభించిన తరుణంలో అరెస్టు చేయబడిన వారిలో ప్రభుత్వోద్యోగులు కూడా కొందరున్నారు. ఆసమయంలో ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న ఆస్తులకు యిచ్చిన ముదరాలను గురించి, విజ్ఞప్తులేవీ రాలేదు, అని సర్దార్ పటేల్ పార్లమెంటులో ఈవేళ వివరించారు.

## న్యాయపరిపాలనా శాఖల విభజన

'న్యాయపరిపాలనా శాఖలను విడదీసే కార్యక్రమం ప్రస్తుతం మద్రాసు, సంయుక్త రాష్ట్రాలలో ఆరంభించాం. అక్కడి అనుభవాలను బట్టి ఆ కార్యక్రమాన్ని ఢిల్లీ, అజ్మీర్-మార్వారా ప్రాంతాలలో అములుజరిపే విషయం ఆలోచించుతాం, అని సర్దార్ పటేలు ఈవేళ పార్లమెంటు ప్రశ్నోత్తర సమయంలో ప్రకటించారు.

# రైల్వే ఆదాయానికి ప్రత్యేక బడ్జెట్ పద్ధతి

## భారత పార్లమెంటు ఆమోదం

న్యూఢిల్లీ, డిసెంబరు 21: రైల్వే ఆర్థిక వ్యవహారాలను తదితర ఆర్థికవ్యవహారాలనుంచి వేరుచేయుంచి, ప్రత్యేక బడ్జెటు పద్ధతిని అనుసరించవలెనని భారత పార్లమెంటు నేడు నిశ్చయించినది. రైల్వే ఆదాయమునుంచి ప్రతి సం॥ ఒక నిర్ణీతమొత్తాన్ని జనరల్ రెవెన్యూకు చేర్చవలెనని కూడా పార్లమెంటు నిర్ణయించినది. వచ్చే 5 సం॥ల లోనూ జనరల్ రెవెన్యూనుంచి వెచ్చించిన మొత్తంమీద 4% డివిడెండును రైల్వేల ఆదాయంనుంచి జనరల్ రెవెన్యూకు చేర్చాలని నిర్ణయమైనది.

ఈ సిఫార్సులను రైల్వే ఆర్థిక విధాన నిర్ణయసంఘం ప్రతిపాదించగా, రవాణా మంత్రి గోపాలస్వామి అయ్యంగార్ పార్లమెంటుచేత ఆమోదింపజేశాడు.

అరుగుతరుగు భర్తీనిధి కింద ఏడాదికి 15 కోట్లు ప్రత్యేకించటం, 5 సం॥లవరకూ ప్రయాణీక సౌకర్యాల నిమిత్తం ఏడాదికి 3 కోట్లను వినియోగించటం మొదలైనవి ఈ సిఫార్సులలోని కొన్ని ముఖ్యాంశాలు.

రైల్వే ఆర్థిక విధాన నిర్ణయసంఘం చేసిన ఈ కింది సిఫార్సులను ఆమోదించవలసినదని గోపాలస్వామి అయ్యంగార్ ప్రతిపాదించాడు.

### రైల్వే ఆర్థిక విధాన నిర్ణయసంఘ సిఫార్సు

(1) రైల్వే ఆర్థిక వ్యవహారాలు తదితర ఆర్థిక వ్యవహారాలనుంచి ప్రస్తుతం మొత్తముగా ఇక ముందుకూడా వేరుచేయించాలి.

(2) ప్రభుత్వానికి పన్నుకట్టే ప్రతి వ్యక్తికీ రైల్వే సంస్థలో వాటాదారు హోదా ఉండాలి.

(3) జనరల్ రెవెన్యూలో నుంచి రైల్వేల కొరకు వినియోగించబడిన ద్రవ్యం మీద ఏడాదికి ఒక నిర్ణీతమొత్తాన్ని డివిడెండుగా జనరల్ రెవెన్యూకి చేర్చాలి.

(4) 1950-51 సంవత్సరముల మొదలుకొని 5 సంవత్సరముల వరకూ పెట్టుబడి మీద ఏడాదికి 100 కి 4 వంతులు డివిడెండుగా చెల్లించాలి, గిట్టుబాటు కానప్పటికీ దేశ రక్షణావసరాలకు మార్గాలను నిర్మించినప్పుడు ఆ పెట్టుబడులమీద జనరల్ రెవెన్యూకు డివిడెండ్లను చెల్లించ నక్కరలేదు.

(5) పై చెప్పిన 5 సం॥లు పూర్తిఅయిన తరువాత డివిడెండు రేటును మార్చే విషయాన్ని పార్లమెంటుచే నియమితమయిన ఒక ప్రత్యేకసంఘం పరిశీలించాలి.

(6) ప్రస్తుతం రైల్వే రిజర్వునిధి అని చెప్పబడుతున్న దానికి రెవెన్యూ రిజర్వ నిధి అని పేరు పెట్టి దానిని జనరల్ రెవెన్యూకి చేర్చవలసిన మొత్తాలను చెల్లించటానికి రైల్వేలకు తరుగువచ్చినప్పుడూ వినియోగించాలి.

(7) ప్రయాణీకులకు సౌకర్యాలు కలిగించటానికి రైల్వే కార్మికులకు సదుపాయాలు చేయటానికి, గిట్టుబాటు కానప్పటికీ అవసరమైన తదితర రైల్వే కార్యక్రమాలను నిర్వహించటానికిగాను అభివృద్ధినిధి నొకదానిని నెలకొల్పాలి.

(8) రైల్వేలలో చెడిపోయినవాటి స్థానంలో కొత్తవాటిని అమర్చటానికీ, తత్సంబంధమైన ఇతర అవసరాలకు ఏర్పడిన, అరుగు తరుగు భర్తీనిధికి ఏడాదికి 15 కోట్లుచొప్పున 5 ఏళ్ల వరకూ కలిపి, దీనిని రైల్వే నిర్వహణ వ్యయంకింద లెక్క వ్రాయాలి.

(9) రైల్వేలమీద వచ్చిన లాభాలను రెవెన్యూ రిజర్వనిధి, అభివృద్ధినిధి, అరుగు తరుగు భర్తీ నిధులకు పంచాలి.

(10) రైల్వేలకొరకు ఒకఆర్థిక స్థాయి సంఘాన్ని, కేంద్ర సలహా సంఘాన్ని నెలకొల్పాలి.

(11) రైల్వే అంచనాలను పార్లమెంటుకి ప్రతిపాదించే ముందుగా ఆర్థిక స్థాయిసంఘానికి ప్రతిపాదించాలి. రైల్వే బడ్జెటు సాధ్యమైనంతవరకూ, సాధారణ బడ్జెట్ కన్నా ముందుగా పార్లమెంటుకి ప్రతిపాదించాలి.

(12) ఈ సూచనలు 1950 ఏప్రిల్ నుంచీ అములుజరగాలి.

ప్రయాణీక సౌకర్యాలకింద ఏడాదికి 3 కోట్ల రూపాయలు వచ్చే 5 సం॥ల వరకూ ఖర్చు పెడతామనీ, అవిధంగా ఖర్చు పెట్టించే బాధ్యత తనమీదనూ, తన అనంతరం వచ్చేవారమీదనూ ఉన్నదనీ గోపాలస్వామి అయ్యంగార్ హామీఇచ్చారు.

రైల్వే ఆర్థిక వ్యవహారాలను 25 సం॥ల కిందట జనరల్ రెవెన్యూనుంచి విడదీశారు.

"1940 నుంచి 1946 వరకూ జనరల్ రెవెన్యూకు రైల్వే ఆదాయంనుంచి 154 కోట్ల రూపాయలు ఇవ్వబడినవి. రైల్వేల లాభాలలో నుంచి ఏడాదికి 22 కోట్లు జనరల్ రెవెన్యూకి చెల్లించాలని పరిశీలన సంఘం సూచించింది. కాని రైల్వేలకు అనేక ఇతర బాధ్యతలుకూడా ఉన్నందువల్ల 15 కోట్లు మాత్రమే చెల్లించవచ్చునని ఈ బిల్లు ప్రతిపాదిస్తున్నది" అని ఆయన వివరించాడు.

అరుగు తరుగు భర్తీనిధికి ఏడాదికి $11\frac{1}{2}$ కోట్లు ఇవ్వబడుతున్నవని ఆయన తెలియజేశాడు.

### చర్చ

ఈబిల్లువల్ల జనరల్ రెవెన్యూకు తక్కువ ఆదాయం వస్తుందనీ, ప్రభుత్వేతర సంస్థలు రైల్వేలను నిర్వహిస్తే జనరల్ రెవెన్యూకు ఎక్కువ ఆదాయంవచ్చే అవకాశం ఉన్నదనీ జస్పత్ రాయ్‌కపూర్ విమర్శించాడు. 100 కి 4 వంతుల డివిడెండును జనరల్ రెవెన్యూకి చేరిస్తే, అభివృద్ధి కార్యక్రమాలకు డబ్బు చాలదనీ, 40 ఏళ్ళనుంచీ దేశంలో ఉన్న రైలు మార్గాల మొత్తం నిడివి ఏమీ పెరగలేదనీ ప్రొ॥ షిబన్లాల్ సాక్సెనా అన్నాడు.

వెనక పనిచేసిన రైల్వే విచారణ సంఘపు అధ్యక్షుడు పండిత కుంజ్రూ మాట్లాడుతూ ద్రవ్య విధాన నిర్ణయం సంఘం ఉపయోగించే పని ఏమీచేయలేదనీ, ప్రస్తుతం ఉన్న పద్ధతి నేమీ మార్చనవసరం లేదనీ అన్నాడు.

### సవరణలు

సి. సుబ్రమణ్యం, నందకిశోర్‌దాస్, జస్పత్ రామ్‌కపూర్, ప్రొ॥ షిబన్లాల్ సాక్సెనా ప్రభృతులు సవరణలను ప్రతిపాదించారు.

గోపాలస్వామి అయ్యంగారి తీర్మానానికి బదులుగా సి. సుబ్రమణ్యం వేరొక తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ప్రస్తుత పద్ధతులనే కొనసాగించాలని సూచించాడు. "లేకపోతే మూడేళ్ళ వరకూ అన్నిరకాల పెట్టుబడులమీదా జనరల్ రెవెన్యూకి 5% డివిడెండ్ ఇప్పించాలి. రైల్వేలను ఇతర కంపెనీల వలెనే చూసి కార్పొరేషన్ పన్ను మొదలైనవి విధించాలి" అని ఆయన ప్రతిపాదించాడు.

డివిడెండ్ 100కి 6వంతులుండాలనీ వ్యవసాయ, పరిశ్రమలను ప్రోత్సహించటానికీ, వర్కుషాపుల్లో సాంకేతిక శిక్షణ నివ్వటానికీ రైల్వేలు ఉపయోగించాలనీ నందకిశోర్‌దాస్ ప్రతిపాదించాడు. 4% డివిడెండేకాక ఆదాయపు పన్నుకూడా రైల్వేలు చెల్లించాలని జస్పత్‌రాయ్ కపూర్ సూచించాడు. ప్రొ॥ షిబన్లాల్ సాక్సెనా డివిడెండును 3%కి తగ్గించాలనీ, ప్రస్తుతం ఉన్న సౌకర్యాభివృద్ధినిధి (బెటర్మెంట్‌ఫండ్) ను కొనసాగించాలనీ ప్రతిపాదించాడు. డి. వి. ఆలగేశన్ సమర్థించాడు.

పండితకుంజ్రూ ప్రస్తుతపద్ధతినే అనుసరించవలసినదని హెచ్చరించాడు.

రామనాథగోయెంకా కొత్తసూచనలను సమర్థిస్తూ, "సంస్థాన రైల్వేలను స్వాధీనంచేసుకొనటంల్లో 68 కోట్లను ఆస్తికిమ్మతులోనుంచి కొట్టి వేయవలసి వస్తున్నది. దానికి తగినఆస్తి కనిపించటంలేదు. కాని రాజకీయ కారణాలవల్ల తీసుకోక తప్పదు. అని అన్నాడు.

డా॥ పంజాబ్‌రావ్ దేశముఖ్ గోపాలస్వామి అయ్యంగారి తీర్మానాన్ని సమర్థిస్తూ స్వల్పసాయోత్పత్తులకు తక్కువ రవాణా రేట్లు విధించాలని కోరారు. ఎం. తిరుమలరావు తీర్మానాన్ని సమర్థించాడు.

### అయ్యంగారి జవాబు

గోపాలస్వామిఅయ్యంగార్ చర్చకు సమాధానమిస్తూ రైల్వేలను ఇతరవాణిజ్య సంస్థలవలె పరిగణించిపన్ను వేస్తే జనరల్ రెవెన్యూకివచ్చే ఆదాయంకన్నా 4% డివిడెండు వల్లనే ఎక్కువ వస్తుందనీ, ప్రయాణీక సౌకర్యాలకై 5 ఏళ్ళపాటు ఏడాదికి 3 కోట్లు వినియోగించబడుతుందనీ, దీనికి తాను తనఅనంతరంవచ్చే రైల్వే శాఖమంత్రులూ బాధ్యత వహించగలరనీ హామీఇచ్చాడు.

అంతట సవరణలన్నీ ఉపసంహరించుకోబడి తీర్మానం సభచేత ఆమోదించబడినది.

## ఎగుమతి దిగుమతి కంట్రోలు సవరణబిల్లు

అనంతరం, వాణిజ్యమంత్రి నియోగి 1947 సం॥ పు ఎగుమతి దిగుమతి కంట్రోలు చట్టాన్ని సవరించటాని కొకబిల్లును ప్రతిపాదించాడు. దిగుమతి లైసెన్సులు కోసం ఎంత రుసుము దరఖాస్తుదారులు చెల్లించవలసినదీ నిర్ణయించే అధికారాన్ని ఈ బిల్లు ప్రభుత్వానికి ఇస్తున్నది. దిగుమతి కంట్రోలు సంస్థను ఆర్థికంగా స్వయంపోషకం చేయడానికీ, వ్యాపారంచేయక పోయినాసరదాకు దరఖాస్తులుపెట్టే దురలవాటు తగ్గించటానికీ ఈ పద్ధతిని ప్రవేశపెట్టవలసిందని ఆయన వివరించాడు.

10 వేల రూపాయల సరకు దిగుమతి లైసెన్సకొరకు దరఖాస్తుపెడితే 10 రూపాయల రుసుమునూ, 10 వేలకుపైనా, లక్షరూపాయలకులోపూ విలువగల సరకు దిగుమతికి లైసెన్స దరఖాస్తుకొరకు 25 రూపాయిల రుసుమునూ వసూలు చేయాలని బిల్లు ప్రతిపాదిస్తున్నది. స్థానికసంస్థలు, ధర్మసంస్థలు, విద్యాసంస్థలు, ప్రభుత్వశాఖలు మొదలైన వాటికి ఇది అన్వయించకుండా చేయమని వారు విజ్ఞప్తి పెట్టుకోవచ్చును.

ప్రస్తుతం దిగుమతి కంట్రోలు సంస్థకు ఏడాదికి 23 లేక 24 లక్షలవుతున్నది. సంస్థ ఏడాదికి 400 కోట్లరూపాయిలసరకు దిగుమతులకు లైసెన్సు నిస్తున్నది. దరఖాస్తు రుసుము నిర్ణయిస్తే ఖర్చుచాలాకూడి వస్తుందని వాణిజ్యమంత్రి వివరించాడు.

మహావీర్ త్యాగి ప్రసంగిస్తూ వేరు వేరు వస్తువుల దిగుమతులకు రుసుము వేరు వేరు రేట్లతో వసూలు చేయాలనీ, తోసివేయబడిన దరఖాస్తులపై రుసుము వసూలు చేయరాదనీ ప్రతిపాదించాడు.

ఇంతలో సభ నేటికి విరమించింది.

## రోడ్డురవాణా కార్పొరేషన్

న్యూఢిల్లీ, డిశంబరు 20: రోడ్డురవాణా కార్పొరేషనులను ఏర్పాటు చేయడానికిన్నీ, నడపడానికిన్నీ నిబంధనలు కల్పిస్తూ శ్రీ సంతానం నేడు పార్లమెంటులో ఒక బిల్లును ప్రతిపాదించారు.

1948 లో పార్లమెంటు అంగీకరించిన రోడ్డురవాణా కార్పొరేషన్ చట్టంలో కొన్ని లోపాలు వున్నందువల్ల నే ఈబిల్లును తీసుకురావలసిన అవసరం కలిగింది.

దీనివల్ల రాష్ట్రప్రభుత్వాలకు రోడ్డు రవాణా కార్పొరేషన్‌లను నెలకొల్పి రవాణా సౌకర్యాలను అభివృద్ధి చేసేనావకాశం కలుగుతుంది.

## గంటల పంచాంగం

విరోధి సం॥ పుష్య శు॥ చవితి

1949 సం॥ డిసెం॥ 23 శుక్రవారం

శు॥ చవితి సా 6-59 శ్ర వ 1.36 వర్జ్యం సా 5-54 ల 7-24 కు.

శు॥ పంచమి డిసెం॥ 24 శనివారం

శు॥ పంచమి సా 7.29 ధని వ2-30 వర్జ్యం రా 10.12 ల 11-55 కు.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ పుష్య శు॥ చవితి

శుక్రవారం

## కార్యవర్గం మందలింపు

భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణ సూత్రమును అనుసరించి క్రొత్తగ ఏ భాషాప్రాంతమును ఏర్పాటు చేయవలసివచ్చినను, ముందుగ జయపూర్ కాంగ్రెస్ నియమించిన నాయకత్రయ సంఘము సూచించిన షరతులు అందుకు సంబంధించినవారందరిచే అంగీకరింపబడి, నూతన రాష్ట్రసరిహద్దుల విషయమున సంశ్లిష్ట అన్యభాషా ప్రాంతములతో సమాధానము కుదిరినగాని తాము ఎట్టి చర్య తీసుకొనుట సాధ్యముగాదని కాంగ్రెస్ కార్యవర్గము, కేంద్ర ప్రభుత్వము అనేక పర్యాయములు విస్పష్టము చేసియుండెరు. ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర ప్రాంతములను ప్రత్యేక రాష్ట్రములుగ ఏకము చేయుటలో గల సాధకబాధకములను వివరించి, వాటిని అధిగమించి రాష్ట్రముల నిర్మించుటకుగల యవకాశములను సూచించిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము, తమిళ కాంగ్రెస్ సంఘము, చెన్నరాష్ట్రప్రభుత్వము అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గ సూచనప్రకారము ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సంబంధించిన నాయకత్రయ నివేదికాంశములను అంగీకరించి యుండుటవలన కేంద్ర ప్రభుత్వము ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు అవసరమైన చర్యలను తీసుకొనుట జరిగెను.

కర్నాటక కాంగ్రెసు నాయకులు అసలు విషయమును గ్రహింపక కేవలము ఆంధ్రులకు రాష్ట్రమేర్పడిపోవుచున్నదను ఆక్రోశముతో తమ రాష్ట్రమును పొందుటకు శాసనసభల్లోని కర్నాటక సభ్యులచే వారి సభ్యత్వములకు రాజీనామాల నిప్పించి కాంగ్రెసు కార్యవర్గముపై ఒత్తిడి తీసుకొనివచ్చుటకు ప్రయత్నించిరి. కర్నాటక కాంగ్రెస్ కార్యవర్గము శాసనసభలలోని కర్నాటకు లందరు తమ సభ్యత్వములకు రాజీనామా నివ్వవలెనని తీర్మానించినపుడే, మేమా వైఖరిని గర్హించియుంటిమి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమువలెనే కర్నాటక కాంగ్రెస్ సంఘము కూడ ప్రత్యేక కర్నాటకరాష్ట్ర నిర్మాణమునకు పేలుగ ముందు జరుగవలసిన కార్యక్రమమును నాయకత్రయ నివేదకను అనుసరించి పూర్తి చేసుకొనిన కేంద్ర ప్రభుత్వము కర్నాటకరాష్ట్ర నిర్మాణమునకు అవసరమైన అధికారచర్యలు తీసుకొనగలదని కూడ ఆ సందర్భమున సూచించియుంటిమి.

కర్నాటక కాంగ్రెసు కార్యవర్గమువారు నాయకత్రయ నివేదిక సూచనలననుసరించి మైసూరు సంస్థానమును సంశ్లిష్ట కర్నాటక జిల్లాలలో చేర్చి ఐక్య కర్నాటక రాష్ట్ర నిర్మాణమునకు సంస్థాన ప్రజల సుముఖులచేయుటకు ప్రయత్నించుటకు బదులు, కాంగ్రెసు కార్యవర్గమును "బెదిరించి" రాష్ట్రమును సంపాదింపదలచిరి. కాంగ్రెస్ కార్యవర్గము మొన్నటి సమావేశమునందు పరిస్థితులనన్నింటిని పరిశీలించి, కర్నాటకరాష్ట్ర నిర్మాణమునకు గల అవరోధములను వివరించి, ఇప్పటికైనను మైసూరు సంస్థానము ఇతరకర్నాటక ప్రాంతములో చేరిపోవుటకు సమ్మతించిన రాష్ట్రనిర్మాణమునకు అవసరమైన చర్యలను తీసుకొనగలమని వాగ్దానము చేసెను. కర్నాటకుల రాజీనామాలను బెదిరింపులుగ కాంగ్రెస్ కార్యవర్గము భావించుట సహజమే. కాంగ్రెస్ కార్యవర్గము విశదము చేసినట్లు కర్నాటకులతో పాటు చర్య కాంగ్రెసు విచ్ఛిన్నతకు మాత్రమే దారితీయును. కర్నాటక కాంగ్రెస్ నాయకులు తమఅనాలోచితచర్యల దుష్ఫలితముల నిప్పటికైనను గ్రహించి రాజీనామా సంకల్పమును విరమించుకొందురని విశ్వసించుచున్నాము.

కర్నాటకుల రాజీనామాల వార్త ప్రకటితమైన రోజుననే భారతప్రభుత్వ వైఖరిని మరొకపర్యాయము విస్పష్టము చేయుచు ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఏ భాషాప్రాంతమైనను నాయకత్రయ నివేదికాంశములను తృప్తిపరచిన ఆప్రకారము రాష్ట్రనిర్మాణమునకు కేంద్రప్రభుత్వము చర్యలు తీసుకొనగలదని ప్రకటించిరి. ఐక్య కేరళ రాయబారవర్గమునకును పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్ ప్రభృతులు ఇదే విషయమును స్పష్టముచేసిరి. కర్నాటకనాయకులు పరిస్థితులను గ్రహించి ఇకమీదటనైనను వాస్తవిక దృష్టితో వ్యవహరించెదరని ఆశించుచున్నాము. ఇతరులకు రాష్ట్రము ఏర్పడినదని ఆందోళన చెందుటకంటె రాష్ట్ర సంపాదన కవసరమైన నిర్మాణాత్మకవిధానమును అనుసరించుట ప్రయోజనకరము. ఈ విషయమును వారు గ్రహించెదరుగాక!

## చైనాపై ఫ్రెంచి విమానాల విహారం

హాంకాంగు, డిసెంబరు 21: డిసెంబరు 14న చైనా భూభాగంపైగా ఫ్రెంచి విమానాలు పోయినవని కమ్యూనిస్టు చైనా ప్రభుత్వ విదేశమంత్రి జనరల్ చౌ ఎన్ లే ఆరోపించినట్లు పెకింగురేడియో తెలుపుతున్నది.

ఈ విషయమై నిన్న రేడియో అధికారప్రకటనచేస్తూ ఆయన "సహించరాని ఈ శత్రు చర్యపట్ల" తీవ్రమైన అధిక్షేపణ చేస్తూ, ఇందువల్ల కలిగే ఫలితాలన్నిటికీ ఫ్రెంచిప్రభుత్వమే బాధ్యత వహిస్తుందన్నారు.

ఇండో చైనా సరిహద్దువద్ద కమ్యూనిస్టులకూ జాతీయవాదులకూ యుద్ధం జరుగుతున్న క్వాంగ్సీ యుద్ధరంగంమీదుగా అయిదు ఫ్రెంచి విమానాలు 'ప్రక్షి'చేస్తూ వెళ్ళినవట.

## చెంగ్‌టూవద్ద కమ్యూనిస్టు విజయాలు

హాంకాంగు, డిసెంబరు 21: పదిరోజుల క్రితం చైనా జాతీయ ప్రభుత్వంవారు ఖాళీచేసిన తాత్కాలిక ప్రభుత్వ కేంద్రమైన చెంగ్‌టూ వద్ద మిగిలిపోయిన జాతీయవాదులను కమ్యూనిస్టు సేనలు కత్తెరవ్యూహంలో చుట్టుముట్టుతున్నవని నేటిరాత్రి పెకింగురేడియో ప్రకటించింది.

నవంబరు 1 మొదలుకొని చైనా కమ్యూనిస్టు లిప్పటికి, ఫ్రాన్సు నైరుతిలో సగంగల ప్రాంతంలో 132 చిన్న, పెద్ద పట్టణాలను పట్టుకొని 70 వేల మందిజాతీయ సైనికులను యుద్ధరంగంలో నుంచి తొలగించారట.

## ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఒలెంపైడ్

### కార్యక్రమం వివరాలు

విజయవాడ, డిసెంబరు 20: ఈనెల 24 నుంచీ ఇక్కడ జరుగనున్న ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఒలెంపైడ్ ఈ దిగువ కార్యక్రమం ప్రకారం జరుగును:—24 తేదీ ఉదయం 7 గం.కు ఒలెంపైడ్ మార్చి (ఒలెంపైడ్ గ్రౌండ్సులో డా॥ కాం॥ కార్యాలయంనుండి) 8 గం ఒలెంపైడ్ పతాకారోహణము, పుయ్యూరు కుమార రాజాగారు, 9 స్పోర్ట్సుకమిటీ ప్రారంభోత్సవము ఆంధ్ర కేసరి ప్రకాశంగారు సా. 4 ఆటల పోటీల ప్రారంభము. 31 వరకూ పోటీలు. 30. ఉ॥ 8. స్పోర్ట్సు మీట్, ఎన్. జి. రంగాగారు. 31 ఉ॥ 7. ఒలెంపైడ్ మార్చింగ్, ప్రతినిధులు, ఆటలపోటీదారులు, వాలంటీరు దళాలు పురజనులు పాల్గొందురు. 12. సైకిల్సు. సా॥ 5. ఒలెంపైడ్ మహాసభ. అధ్యక్షుడు డా॥ యం. చెన్నారెడ్డిగారు. ఉపన్యాసకులు, ఒలెంపైడ్ కమిటీ అధ్యక్షుడు జానకి రామయ్య, సుంకర సత్యనారాయణ, దండమూడి రాజగోపాలరావు, కాకాని వెంకటరత్నంగార్లు. 31. 7. బహుమానాల బహూకరణ.

### ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ 4-వ మహాసభల కార్యక్రమము

ఈనెల 31, జనవరి 1, 2 తేదీలలో జరిగే ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ మహాసభల కార్యక్రమ మిట్లున్నది: 31-రాత్రి 9. ప్రతినిధుల ఇష్టాగోష్ఠి. 1-వ తేది ఉ॥ 7. ప్రభాత్ ఫేరి, 8. పతాకారోహణము. మునిరెడ్డిగారు. 9. ప్రతినిధుల సమావేశము. మ॥ 1. వాగ్వివాదపోటీలు, 3. సంగీతపోటీలు, 4. రాజకీయ మహాసభ స్వాగతోపన్యాసం. వి. వెంకటేశ్వర రావుగారు. మహాసభాధ్యక్షుడు సుంకర సత్యనారాయణగారు, ప్రారంభకుడు- త్రిలోకసింగ్, ఉపన్యాసకులు-రంగా, ప్రకాశం, శ్రీనివాసన్, యస్. శేషగిరి రావు, కె. పున్నయ్య, యం. నాగేశ్వర రావు, కె. వి. సుబ్బయ్య, జి. పి. రంగా ఎ. ఎస్. ఆర్. కృష్ణాగార్లు. 7. బుర్రకథ (రాజోలువిద్యార్థి కాంగ్రెసువారు) 8 నాటకములు. 10. ప్రతినిధుల సమావేశము. 2 వ తేదీ ఉ॥ 7. ప్రభాత్ ఫేరి, 8. నమూనా పార్లమెంటు సమావేశము. 12. ప్రతినిధుల సమావేశం, 3 సింపోజియం: అధ్యక్షుడు, ప్రొ. సుబ్రహ్మణ్యం గారు. సా॥ 4. వ్యాసరచన పోటీలు: అధ్యక్షుడు-నార్ల వెంకటేశ్వర రావుగారు. ఉపన్యాసకులు:-విశ్వనాథ సత్యనారాయణ, వేదాంత రామస్వామి, మైనేని రామకోటయ్య, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగార్లు. 7. విచిత్రవేషాలు, 8. వైజ్ఞానిక బహూకరణ, కందుల ఓబులరెడ్డిగారు. 9. నాటకములు, భరతనాట్యము. 11 ప్రతినిధుల సమావేశము.

## శ్రీ జగజ్జీవనరాం ఆంధ్రదేశ పర్యటన

### శ్రీ బి. యస్. మూర్తి విజ్ఞప్తి

మదరాసు, డిసెంబరు 21: "ఇండియా ప్రభుత్వ కార్మికమంత్రి శ్రీ జగజ్జీవనరాం ఈనెల 30, 31 తేదీలలో రెండవసారి ఆంధ్రదేశమునకు వచ్చుచున్నారు. వారు 30 తేదీ ఉ॥ 11-0 లకు విశాఖపట్నం విమానాశ్రయము చేరెదరు. రోజంతా అక్కడవుండి రాత్రి రైలులో కాకినాడ వెళ్ళెదరు. కాకినాడలో ఒకపూటవుండి అదేరోజున కలకత్తా మెయిలులో మదరాసు వెళ్ళెదరు. ఆంధ్రదేశములోని వ్యవసాయ కూలీలు, హరిజనులు వేగలాది వచ్చి తమ నాయకునికి ప్రతిచోట్ల అఖండ స్వాగతమివ్వవలెను" అని ఆం. రా. వ్యవసాయకాంగ్రెసుఅధ్యక్షుడు శ్రీ బి. యస్. మూర్తిగారు విజ్ఞప్తి చేయుచున్నారు.

## భారత కార్మికశాఖ మంత్రి కార్యక్రమం

న్యూఢిల్లీ, డిసెంబరు 21: భారతప్రభుత్వ కార్మికశాఖామంత్రి జగ్జీవన్ రాం గారు డిసెంబరు 24 వ తేదీన మైసూరుకు వచ్చి, వివిధరాష్ట్రాల కార్మికమంత్రుల సమావేశానికి అధ్యక్షత వహిస్తారు. మైసూరునుంచి విశాఖపట్నం, కాకినాడ వెళ్ళి మద్రాసు చేరుతారు జనవరి 3 వ తేదీకి తిరిగి మైసూరువెళ్ళి అంతర్జాతీయ కార్మిక సంస్థ పాలకవర్గ సమావేశానికి హాజరై 6 వ తేదీకి ఢిల్లీ వస్తారు.

## ప్రధాని అట్లీతో కృష్ణమీనన్ గోష్ఠి

లండను, డిసెంబరు 21: ఇండియా హైకమిషనరు వి. కె. కృష్ణమీనన్ నేటి ఉదయం బ్రిటిషు ప్రధాని అట్లీనిచూశారు. దీనికి ప్రత్యేక కారణం ఏమీలేదట. కృష్ణమీనను డిసెంబరు 25వ ఇండియాకు విమానంలో బయలుదేరుతారు.

## అమెరికా విధనం: హెండర్సన్ వివరణ

(1-వ పేజీ తరువాయి)

స్వఫు ఒడంబడికలు చేసుకోలేదు పండిత నెహ్రూ పదేపదే ప్రకటనలు చెయ్యవలసి వచ్చింది. ఈ విషయంలో అమెరికాతరఫున నేను కూడా ఒక ప్రకటన చెయ్యదలంచుకున్నాను. పండిత నెహ్రూను అమెరికాకు ఆహ్వానించినప్పుడు ఆయనను తమ దేశవిధానాలు మార్చుకోవలసిందని అమెరికా ఎంతమాత్రము అడుగలేదు.

అమెరికాను గురించి ఈ దేశంలోని అమెరికా మిత్రులకు కూడా కొన్ని అపోహలు బయలుదేరాయి. అమెరికా తనశక్తిసామర్థ్యాలన్నీ కమ్యూనిజాన్ని నిర్మూలించడానికై ప్రయత్నిస్తున్నదని ఈ మిత్రులు అనుకుంటున్నారు. అమెరికా ప్రజలు ఈ విధమయిన ప్రయత్నాలేమీ చెయ్యడంలేదు. అయితే ప్రపంచంలో దురాక్రమణలు జరగడానికిగాని, ప్రజల స్వాతంత్ర్యం బలవంతంగా అపహరించి వారిపై మరొకరకపు రాజ్యాంగం విధించడానికిగాని అమెరికా ఎంతమాత్రము అంగీకరించదు. అమెరికా దురాక్రమణలు అరికట్టడానికి తాను చెయ్యగలిగినదంతా చేస్తున్నది. దురాక్రమణను అరికట్టకపోతే అది క్రమక్రమంగా ప్రపంచ శాంతికి భంగంకలిగిస్తుందని భయపడుతున్నది."

అమెరికా రాయబారి ఇంకా ఇలాగ అన్నారు. "ఇండియా అమెరికాల విదేశ విధానాలలో భేదమున్నదని అనేకులు భావిస్తున్నారు. నిజంగా అలాంటి భేదం ఏమీలేదు. అమెరికా విధానాన్ని పిన్నగా అర్థంచేసుకోక పోవడంవల్లనే ఇలాంటి అపోహ ఏర్పడిందని మా అభిప్రాయము. అమెరికాకూడా ఆయా వ్యవహారాల ప్రత్యేకత్వాన్ని బట్టే వాటిమంచిచెడ్డలు నిర్ణయిస్తున్నదిగాని, మరొకవిధానాన్ని జన్నీ అనుసరించడంలేదు."

అమెరికా విదేశాలకు ఆర్థికంగా చేసే తోడ్పాటునుగురించి ఏర్పడిన అపోహలను గురించి మాట్లాడుతూ హెండర్సను ఇలా అన్నారు. "అమెరికా ఆయా దేశాలను యుద్ధానికి తయారు చెయ్యడానికే ఈ సహాయం చేస్తున్నదనీ, ఆయా దేశాలలో బాధపడే ప్రజల సహాయానికి అమెరికా ఏమి చెయ్యడంలేదనీ అంటున్నారు. 1945 నుంచీ అమెరికా చేసిన సహాయ ప్రణాళికలు పరిశీలించిన వారికి అమెరికా చేసిన సహాయం ఎంత గొప్పదో బోధపడుతుంది. ప్రపంచ చరిత్రలో అమెరికా పరదేశాభివృద్ధికి చేసిన సహాయం లాంటిది అభూతపూర్వము. మా దేశంలో పౌరుల కివ్వవలసిన ఋణము, పన్నులభారాలూ ఎక్కువగా ఉన్నాయి. మాదేశ చరిత్రలో ఇలాంటివి ఎన్నడూ కనివిని ఎరగము. అయినా మేము అంతర్జాతీయ సంస్థల ద్వారా గాని, స్వయంగా గాని ఇంకా విదేశ ప్రజలకు అనేక విధాలుగా ఆర్థికాది సహాయాలు చేస్తూనే ఉన్నాము.

అయితే అమెరికా సంపద ఎప్పటికీ తరగదని భావించడానికి వీలులేదు. ప్రపంచంలో ప్రతిచోటా ఆర్థిక సహాయం కావాలని అంటున్నారు. మేము వీరందరి కోరికలు మన్నించలేక పోయాము. అందుచేత మామీద చాలా తీవ్రమైన విమర్శన బయలుదేరింది. అయితే ఏయే దేశాలకు సహాయం చేస్తే మంచిదో ముందుగా ఆలోచించి ఆ తరవాతనే మేము సహాయం చేశాము. ప్రపంచ పురోభివృద్ధికి తోడ్పడే పరిస్థితులలోనే మామీ విషమయిన సహాయం చేస్తున్నాము."

ప్రధాన మంత్రి పండిత నెహ్రూ, విదేశ రాయబార వర్గాలు, కాంగ్రెసు అధ్యక్షులు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు, ఇంకా కొంతమంది పుర ప్రముఖులు హాజరైనారు.

## రష్యాలోని నాల్గు లక్షల జపాన్ యుద్ధఖైదీలు

టోకియో, డిసెంబరు 21: జపాను ఖైదీలను రష్యా భూభాగంనించి తిరిగి తీసుకువచ్చే విషయం చర్చకు రాగానే ఇక్కడ మిత్రరాజ్యమండలి సమావేశానికి వచ్చిన రష్యా ప్రతినిధులు చర్చలో పాల్గొనడానికి నిరాకరిస్తూ అక్కడనించి లేచివెళ్ళారు.

ఈరష్యా ప్రతినిధి లెప్టినెంటు జనరల్ కూజ్మాజెన్కోతో ఈ విషయములో మాట్లాడుతూ, "ఈ సమావేశంలో ఈవిషయం చర్చించడానికి వీలులేదు." అని అన్నారు.

ఇంతకుముందుగా ఆయన మాట్లాడుతూ అమెరికా ముందుజరగబోయే రష్యా వ్యతిరేకయుద్ధంలో జపానువారిని కేవలం యుద్ధానికిబలి గావాడుతున్నారని అన్నారు.

రష్యా ప్రతినిధి నిర్గమించిన తరవాత ఈ విషయంలో అమెరికా ప్రతినిధి విలియమ్ సీబాల్డ్ ఇల్లాగ అన్నారు." జపాను ఖైదీలను గురించి రష్యా మనకు సమాచారము ఏమీ తెలియనివ్వలేదు. అందుచేత రష్యాచేతులలో ఉన్న 3 లక్షల 74 వేల 41 మంది జపాను ఖైదీలు చచ్చిపోయి ఉంటారని అనుకోవలసింజే."

## మార్షల్ స్టాలిన్ 70 వ జన్మదినం

### మాస్కోలో, తూర్పు యూరప్‌లో ఉత్సవాలు

మాస్కో, డిసెంబరు 21: ఇరువది ఐదేండ్లుగా ప్రపంచంలో ఐదోవంతు జనాభాకు నాయకుడుగా ఉన్న మార్షల్ స్టాలిన్‌కు నేటితో 69 ఏండ్లు నిండినవి. జార్జియాలో చెప్పులు కుట్టుకొని జీవించే ఒక బీదకుటుంబంలో జన్మించి స్వీయ ప్రతిభవల్ల యీనాడు సోవియట్ రష్యాకు అధినేతఅయిన స్టాలిన్ 70వజన్మదినోత్సవం రష్యారాజధానిలో పశ్చిమ, తూర్పు యూరప్ రాజ్యాలన్నింటిలోనూ యీరోజు కడు వైభవంగా జరిగింది. ఈ సంవత్సర ప్రాచ్యఖండంలో కమ్యూనిస్టు చైనా గూడా స్టాలిన్ జన్మదినోత్సవం జరుపుకొన్నది. ప్రపంచంలో కమ్యూనిస్టురాజ్యా లన్నింటి తరఫున నాయకులు, ప్రతినిధులు, మాస్కోకువచ్చి తమ నాయకాగ్రేసరునికి 70 వ జన్మదినోత్సవ సందర్భమున, శ్రద్ధాంజలి సమర్పించుకొన్నారు.

'కార్మిక పితామహా' 'శాంతినాయక' అని పొగడుతూ కోటానుకోట్ల రష్యన్లు జన్మదిన సందేశములంపారు. "ఉత్పత్తి" లత సహస్రాధికంగా పెంపొంది యిదివరకున్న ప్రమాణాలను మించుతామని, వాగ్దానంచేయటం సోవియట్ ప్రజలు తమ నాయకునికి సమర్పించుకొన్న ఉత్తమ జన్మదిన కానుక. కోట్లకొలది పౌనుల విలువగల జన్మదినకానుకలు, తూర్పు యూరప్ రాజ్యాలనుంచి, కొన్ని రోజులుగా వచ్చి పడుతూనే ఉన్నవి. ఈ కానుకలలో, సిల్కు మేజోళ్ళు లగాయతూ, మోటారు కార్ల వరకూ ఉన్నవి. స్టాలిన్ ఫోటోలు 10 లక్షలు, ఆయన జీవితచరిత్ర సంగ్రహంగా ముద్రించిన 5 లక్షల కరపత్రాలు, 20 లక్షల జన్మదిన కార్డులు, మాస్కోలోను, ఇతరత్ర రష్యన్ పట్టణాలలో, గ్రామ ప్రాంతాలలోనూ పంచిపెట్ట బడినవి.

### స్టాలిన్ దర్శనం

మాస్కో, డిసెంబర్ 21: తన జన్మదినోత్సవ సందర్భమున బోల్షోయ్ థియేటర్‌లో యీ రాత్రి జరిగిన సభకు మార్షల్ స్టాలిన్ హాజరైనాడని, సోవియట్ అధికార వార్తాసంస్థ టాస్ ప్రకటించింది. ఇలా బహిరంగంగా ప్రజలకు కన్పడటం యీ యేటికిది రెండవసారి. క్రితం జూలై 17 వ తేదీ, సోవియట్ వైమానిక ప్రదర్శనం సందర్భంలో ఒకసారి స్టాలిన్ దర్శనం యిచ్చాడు.

బ్రహ్మాండమైన స్టాలిన్ చిత్రమొకటి రెడ్ స్క్వేర్‌కు క్రెమ్లినుకు ఎన్నో వేల అడుగుల ఎత్తున గాలిలో బెలూన్ తో వ్రేలాడగట్టబడింది. రాత్రి వేళ విద్యుద్దీప కాంతుల ప్రసారంలో యీ చిత్రం మాస్కో నగరంలో అన్ని మూలలకూ కానవచ్చినది. నగరంలో ప్రతియింటిపైనా చిన్న-చిన్న ఎర్రజెండాలు సగర్వంగా ఎగురుతున్నవి. నగరంలో ఎక్కడచూచినా స్టాలిన్ చిత్రాలే. ఇవి కొన్ని వేల సంఖ్యలో ఉన్నవి. చాలాచోట్ల స్టాలిన్ ఫోటో ప్రక్కనే లెనిన్ ఫోటోగూడా ఉన్నది. మరికొన్నిచోట్ల మార్క్సు, ఎంగిల్సు, లెనిన్ స్టాలిన్‌ఫోటోలొకదానిప్రక్క ఒకటి అమర్చబడిఉన్నవి.

### మావ్ సీటుంగ్ కృతజ్ఞత

చైనా కమ్యూనిస్టు నాయకుడు మావ్ సీటుంగు మాస్కో రేడియోలో ప్రసంగిస్తూ ప్రపంచ ప్రజానీకాని కంతకూ, చైనా ప్రజలకు, స్టాలిన్ స్నేహితుడు ప్రవక్త అని వర్ణించాడు.

"స్వాతంత్ర్య సముపార్జనకై చైనా పీడిత ప్రజాకోటి సాగించిన దీర్ఘసమరంలో, స్టాలిన్ స్నేహప్రాముఖ్యాన్ని బాగా అవగాహన చేసుకోగలిగింది. మాకు అప్తమైన స్టాలిన్‌కు రష్యా సుఖ సౌభాగ్యములతో విరాజిల్లు వలెనని నా ఆకాంక్ష" అని మావ్ సీటుంగ్ అన్నాడు.

### భారత కమ్యూనిస్టుపార్టీ సందేశం

70 వ జన్మదినోత్సవ సందర్భమున మార్షల్ స్టాలిన్‌కు, భారత కమ్యూనిస్టు పార్టీ శుభసందేశాన్ని పంపుతూ "ప్రపంచ కార్మికులు, ఎదురులేని నాయకుడని పీడిత ప్రజాకోటికి విమోచకుడు, మిత్రుడు" అని స్టాలిన్‌ను ప్రశంసించింది. అన్ని దేశాలలోనూ, అన్ని జాతుల స్వాతంత్ర్యమునకు స్టాలిన్ పేరు స్వాతంత్ర్యచిహ్నం అని గూడా పొగడింది.

### బొంబయిలో ఉత్సవం

బొంబయి, డిసెంబరు 21: మార్షల్ స్టాలిన్ 70 వ జన్మదినోత్సవం యీవేళ కంగార్ మైదానంలో జరుపబడినది. పి. బి కంఠాలి అధ్యక్షత న బహిరంగసభ జరిగింది

### బ్రిటిష్ పత్రికల ప్రశంస

70 వ జన్మదినోత్సవ సందర్భమున, మార్షల్ స్టాలిన్, జీవితవిషయాలకు, ఆయన సాధించిన ఘనకార్యాలకు, బ్రిటిష్ పత్రికలు ఎక్కువ చోటిచ్చి ప్రచురించినవి. ప్రతిపత్రిక తన రాజకీయ దృక్పథాన్ని అనుసరించి స్టాలిన్ సాధించిన ఘనకార్యాలపై వ్యాఖ్యానాలు చేసినవి. "అతిశయోక్తులతో కూడిన ప్రచారాన్ని మినహాయించినా మొత్తం మీద స్టాలిన్ మహత్కార్యాలనే సాధించాడని చెప్పాలి" ఆయన నాయకత్వాన రష్యా కొత్తఖండంలా మారింది స్టాలిన్‌ను, రోమక్ చక్రవర్తియైన అగస్టస్‌కు పోల్చవచ్చు. మా ప్రాజ్యాన్ని బలపర్చటానికి యత్నంలో ప్రజలు తనను దైవంగా పూజించుటకు అగస్టస్ సమ్మతించినట్లే, కమ్యూనిజాన్ని అవిచ్ఛిన్నంగా కాపాడుటకు స్టాలిన్ గూడా ప్రజలు తనను దైవంగా పూజించుటకు సమ్మతించాడు" అని టైమ్సు వ్రాసింది.

కమ్యూనిస్టు దేవుడు లేకుండా కమ్యూనిస్టులు జీవించలేరని మాంచెస్టర్ గార్డియన్ వ్రాసింది. స్టాలిన్ ఒక చిన్న దేవుడని లేబర్‌పార్టీ పత్రిక "డెయిలీ హెరాల్డ్" వ్రాసింది.

## ఆంధ్రరాష్ట్ర ఆర్థికస్థితి

(1 వ పేజీ తరువాయి)

నాయకుడు చెప్పెను. మద్రాసు ఎలెక్ట్రిక్ సప్లయి కార్పొరేషను, బస్సులను జాతీయ మొనర్చినదానికి ఆంధ్రులకు పరిహారము ఇవ్వబడునని ఒక విభజనసంఘ సభ్యుడు తెలిపెను.

## విభజన సంఘ కార్యకలాపము

### శ్రీ భక్తవత్సలం అభిప్రాయం

విభజన సంఘంవారు నేడు ఆర్థిక ఉపసంఘ నివేదికపై చర్చ సాగించిరనియు డిసెంబరు నెలాఖరుకు విభజన సంఘ కార్యకలాపమును ముగింపవచ్చునయు మద్రాసు ప్రచారమంత్రి భక్తవత్సలంగారు ఆంధ్రపత్రిక ప్రతినిధితో తెలిపిరి. మదరాసు ప్రభుత్వ నివేదిక కేంద్ర ప్రభుత్వమునకు జనవరి మొదటివారములో, పంపవచ్చుననిరి.

## అదనంగా 88 కోట్ల రూపాయల గ్రాంటు

### ఆర్థికమంత్రి జాన్‌మత్తాయి కోరనున్న సూచన

న్యూఢిల్లీ, డిశెంబరు 21: ఇప్పుడు జరుగుతున్న పార్లమెంటు సమావేశంలోనే అదనంగా 88 కోట్ల రూపాయల గ్రాంట్లుకావాలని ఆర్థికమంత్రి డా॥ జాన్ మత్తాయి అడగనున్నట్లు తెలుస్తున్నది.

రూపాయివిలువను తగ్గించిన కారణంగా ఏర్పడ్డలోటును భర్తీ చేయడానికి 79 కోట్ల రూపాయలు అవసరమైనట్లు భావించబడుతున్నది.

రూపాయివిలువ తగ్గించడంవల్ల దానికి పూర్వం బంగారాన్ని కొనేశక్తి తగ్గిపోయింది. అయితే బంగారంవిలువకు, రూపాయివిలువకు పూర్వంకన్నా ఎక్కువ తేడా ఏర్పడింది. అందుమూలంగా ఇండియా అంతర్జాతీయ ద్రవ్యనిధికి 6 కోట్ల 85 లక్షల 68 వేల 3 వందల రూపాయలున్నూ, ఇంటర్నేషనల్ బ్యాంకుకు 10 కోట్ల 46 లక్షల 12 వేల 3 వందల రూపాయలున్నూ అదనంగా కట్టుకోవలసి వచ్చింది. ఇదికాకుండా 10 లక్షల 22 వేల 200 వందల రూపాయల రొక్కాన్ని గూడా చెల్లించవలసిన అవసరంఏర్పడింది.

ఇవిపోగా కాందిశీకుల రక్షణసౌకర్యాలనిమిత్తం అదనంగా ఇంకో 3.25 కోట్లున్నూ, కష్టముల క్రింద 2 కోట్ల 56 లక్షల 85 వేలున్నూ, రాజ్యాంగపరిషత్తు ఖర్చులక్రింద 1 కోటి 16 లక్షల 30 వేలున్నూ ఓటర్లజాబితాలు తయారుచేయడానికి 98.50 లక్షలున్నూ ఇంకో 41.13 లక్షలు ఇంకోదానికిన్నీ కావాలని ఆయన పార్లమెంటును కోరదలచుకున్నారు.

## పోలీసు శిబిరంపై కమ్యూనిస్టుల దాడి

### కలకత్తావద్ద సంఘటన:

కలకత్తా, డిశంబర్ 20: డిశంబర్ 18 వ తేదీన లాయల్‌గంజ్‌లోని పోలీసు మకాంమీద సాయుధకమ్యూనిస్టు దుండగులుదాడి చేశారు. పోలీసువారు కాల్పులు చేసి వారిని తరిమివేశారు. పోలీసుమకాంమీద బాంబులుకూడా విసిరివేశారు. లాయల్‌గంజి కలకత్తాకు 40 మైళ్ళ దూరంలో వున్నది.

ఈ దుండగీండ్రు, ముందుచుట్టూ పరిసరాలలోవున్న ఇళ్ళుదోచి, నిప్పంటించారు. అనంతరంసరాసరి పోలీసు మకాంమీదికి దాడిచేసి బాంబులు విసిరారు దానిమీద పోలీసువారు తుపాకులుప్రయోగించి గుంపును చెదరగొట్టారు.

నిన్న టిదినం ఇదే ప్రాంతంలో మరో సంఘటన జరిగింది.

కొంతమందిజనం లాయల్‌గంజిలో వున్న ఒక జమీందారు తాలూకు రెండు కచేరీలపైన (శిస్తు వసూలుకేంద్రాలు) దాడిచేసి వాటికి నిప్పుపెట్టారు. మంటలు ఆరిపేలోగా చాలా ఆస్తి తగులబడి పోయింది.

### బర్ద్వాన్‌వద్ద అల్లరులు

బర్ద్వాన్, డిసెంబరు 20: బర్ద్వాన్ ప్రాంతంలోని, రైనా పోలీసు స్టేషన్ అజమాయిషీలోని ఒక గ్రామంలో, తప్పించుకు తిరుగుతున్న ఒక కమ్యూనిస్టు నాయకుడు వున్నట్టు తెలిసి పోలీసువారు దాడిచేశారు. ఆ నాయకుణ్ణి తీసుకుని తిరిగిస్తూండగా, కొంతమంది వ్యవసాయ కూలీలు కొడవళ్ళు లాఠీలూ తీసుకుని నినాదాలు చేసుకుంటూవచ్చి పోలీసువారి మీద తిరుగుబాటు చేసి అతనిని విడుదల చేయించటానికి ప్రయత్నించారు. ఈ సంఘర్షణలో పోలీసువారికి కొంతమందికి దెబ్బలుతగిలినై. పోలీసువారు తుపాకులు ప్రయోగించి గుంపును చెదరగొట్టారు.

## కాశ్మీర్ సమస్యపై మెక్‌నాటన్ అంతరంగిక సంప్రతింపులు

న్యూయార్కు, డిసెంబరు 21: ఐక్యరాజ్యసమితికి చెందిన భద్రతామండలి అధ్యక్షులైన జనరల్ ఏ. జి. యల్. మెక్‌నాటన్ భద్రతా మండలియందు చర్చింపబడవలసిన కాశ్మీరు వ్యవహార విషయమును లోపాయికారీ సంప్రతింపుల ద్వారా పరిష్కరించు నిమిత్తమై సభ్యులతో ఇష్టాగోష్ఠిగా సంప్రతింపులు జరుపుచున్నారు. ఈ సంప్రతింపులు నేడు కూడా జరుగుచున్నవి. న్యూయార్కు నగరములో కెనడా రాయబారి కార్యాలయములో పాకిస్తాను విదేశాంగమంత్రియగు సర్ మహమ్మదు జఫ్రుల్లాఖాను గారిని కలిసికొని మాట్లాడిరి. కాశ్మీరు కమిటీ నివేదికవచ్చిన పిమ్మట జఫ్రుల్లా ఖానుగారితో ఇది నాల్గవసారి లేదా అయిదవసారి వీరు కలిసికొని మాట్లాడిరి. భారతీయ ప్రతినిధితో మెక్‌నాటనుగారు నేడు కలిసికొని మాట్లాడలేదు. భారతీయ ప్రతినిధులుగా నున్న సర్ బి. నరసింగరావుగారును సర్ గిరిజాశంకర బాజపాయిగారును నేడు తమ హోటలులోనే యుండిరి. మెక్‌నాటను గారి వద్దనుండి ఒకపిలుపుమాత్రము వారికి నేడు వచ్చెను.

మెక్‌నాటనుగారు నిన్న కాశ్మీరు కమిటీ సభ్యులతో రెండుగంటలసేపు చర్చించిరి ఆచర్చ ముగిసినపిమ్మట నేడు మొదటిసారిగా జఫ్రుల్లాఖాను గారితో మెక్‌నాటనుగారు కలిసికొని మాట్లాడిరి. లేక్‌సక్సెసువద్ద కాశ్మీరుకమిటీ శుక్రవారంనాడుకూడా సమావేశమై చర్చింపును. కాని ఈ సమావేశమునకు మెక్‌నాటనుగారు హాజరుకారు.

కాశ్మీరులోనుండి ఇండియా ప్రభుత్వ పటాలములను, పాకిస్థాను పటాలములను ఏకకాలమందు తొలగించుటయెట్లు అను విషయమే ప్రధానమైన-చిక్కు సమస్యగా నున్నది. ఈవ్యవహారసమస్యకు సంబంధించిన అన్ని విషయములను మెక్‌నాటన్‌గారు యిప్పుడుసమగ్రంగా అవగాహన చేసికోగల్గిరి. ఈసమస్యా పరిష్కారమునకు ఉభయపక్ష సమ్మతమైన పద్ధతిని నిర్ణయించుటకై మెక్‌నాటను గారు ఆలోచించుచున్నారు. అంతరంగికంగా ఏమి జరుగుచున్నదో తెలియుట లేదు. ఈవారంలో భద్రతామండలి సమావేశముగుట అసంభవము. వచ్చేవారం ఆరంభములో భద్రతామండలికి మెక్‌నాటను గారు తాము నిర్ణయించిన పరిష్కార మార్గమును నివేదించెదరు. దానిని, పాకిస్తాను ప్రభుత్వానికి ఇండియా ప్రభుత్వానికి నివేదించవలసి యుండును. తమ ప్రభుత్వముల వద్దనుండి కర్తవ్యమేమిటో తెలియజేసెడి సూచనలు వచ్చిన పిమ్మటనే ఉభయప్రభుత్వముల ప్రతినిధులును యీ విషయమై చర్చింపగలరు.

కాశ్మీరుకు ఆక్టింగు ప్రధానమంత్రియగు బక్షీ గులాం మహమ్మదుగారు కాశ్మీరు కమిటీ నివేదికను గూర్చి యిట్లు చెప్పిరి.

భారత రాజ్యాంగపరిషత్తులో కాశ్మీరుకు ప్రాతినిధ్యము భారత ప్రభుత్వమొసంగుట చాలా ఆక్షేపణీయమైన విషయమని పాకిస్తాను అధిక్షేపించినది. పాకిస్తాను చేసిన యీ అధిక్షేపణలను గౌరవించి ప్రాధాన్యము నొసంగి కాశ్మీరు కమిటీలోని బెల్జియం ప్రతినిధి చాలా మారకు చర్చించెను. పాకిస్తాను చేసిన యీ అధిక్షేపను ఆరీతిగా మన్నించుట అప్రశస్తముగా నున్నది. ఈ నివేదిక చాలా అసంతృప్తికరముగా నున్నది. బెల్జియం ప్రతినిధికి కాశ్మీరు వ్యవహారముయొక్క పూర్వోత్తరసందర్భము లెంతమాత్రమును బోధపడలేదు. ఇండియా ప్రభుత్వముతో చేరియుండుటకు కాశ్మీరు సంస్థానం అంగీకరించినది. గనుక, భారత రాజ్యాంగ పరిషత్తులో కాశ్మీరుకు ప్రాతినిధ్య ముండవలసియున్నది. అట్టి ప్రాతినిధ్యం కాశ్మీరుకు న్యాయతః ఏర్పడిన హక్కు.

# హైద్రాబాద్ సికింద్రాబాద్ నగరాల సంస్కృతీసంప్రదాయాల ప్రాభవం

## ప్రజలు గర్వించదగినవని పౌర సన్మానసభలో రాజాజీ ఉద్బోధ

హైదరాబాదు, డిసెంబరు 21: హైదరాబాదు, సికిందరాబాదు నగరాలు నిర్మించిన సంస్కృతి, సౌందర్యం, సంప్రదాయములనుచూసి నగరపాలకులు, ప్రజలు గర్వపడాలని, వాటి సౌందర్యాన్ని కాపాడటమే కాకుండా ప్రజా భాహుళ్యానికి సర్వ సౌకర్యాలను సమకూర్చాలని గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు నేటి ఉదయం తమకు రెండు నగరాలపాలకసంఘాలు సమర్పించిన సన్మాన పత్రాలకు సమాధానమిస్తూ ఉద్బోధించారు.

చరిత్రాత్మకమైన చార్మినార్ భవనంలో ఈ సన్మానం జరిగింది. భవన ద్వారా లవద్దచేరిన వేలాది ప్రజలను, తన్ను చూడటానికై వారి త్రొక్కిసలాటను, వారి నదుపు చెయ్యటానికి పోలీసులు పడే శ్రమను చూసి, సందడి, గలభా లేకుండా చేసే ప్రయత్నంలో తానెవరికైతే సన్నిహితముగా కలుసుకుని మాట్లాడాలని అనుకుంటున్నాడో ఆప్రజాసమూహం తనకు దూరమైపోతున్నదని రాజాజీ అన్నారు.

సరిగ్గా 9-10 నిముషాలకు ఫలుక్నామా కోటనుండి రాజాజీ చార్మినార్‌కు వచ్చారు. త్రోవపొడుగునా అసంఖ్యాకులైన జనం, హిందువులు, ముస్లిములు ఆయన కభివాదం చేశారు. రాజాజీవెంట ఎమ్. కె. వెల్లోడి మిగతా పరివారం ఉన్నారు. రాజాజీకి స్థానికస్వపరిపాలన శాఖామంత్రి నవాబు జైన్ యార్జంగ్ బహదూర్ స్వాగతమిచ్చారు. తరువాత ఉభయనగరాల పాలకసంఘాధ్యక్షులను, సభ్యులను పరిచయం చేశారు. సన్మాన పత్రాలను శ్రీధర వామన్ నాయక్ చదివి, ఒక సుందరమైన పేటికలో రాజాజీకి సమర్పించారు.

అపిమ్మట వి. భూపన్ నారిచే చిత్రితమై, రాజా నరదార్ ఎస్. చే బహూకృతమై, కార్పొరేషను హాలును అలంకరింపవలసిన మహాత్మాగాంధీ చిత్రమును రాజాజీ ఆవిష్కరించారు. సన్మానానికి సమాధానమిస్తూ రాజాజీ ఫలోక్తులు, ఉపదేశములు, ఎన్నో చెప్పుతుంటే వినిపించారు.

"మీ స్వాగతానికి, సన్మానానికి నా కృతజ్ఞత. ఈ సమావేశపు ఏర్పాట్లు చూస్తే కాస్త భయం వేస్తున్నది. ఉభయ నగరాల పౌర ప్రతినిధులు నన్ను చుట్టుముట్టివేశారు; కాని వారెవరికీ ప్రాతినిధ్యం వహిస్తున్నారో ఆ సామాన్య ప్రజలకు నన్ను తొంగిచూడటానికైనా, అసలు లోపల ఏమిజరుగుతున్నదో తెలుసుకోటానికైనా సందివ్వలేదు. (నవ్వు) మీ శిల్పులు నిమెంటుతో నూ, ఇటుకలతో నూ గొప్ప గొప్ప భవనాలు నిర్మించారు. మీ భవన నిర్మాణ శిల్పం సాటిలేనిది. కాని మీ స్త్రీ పురుష ప్రజాసమూహంతో గొప్ప శిల్పాలను నిర్మించే విధానం ఇంకా అభివృద్ధి కావలసి వున్నది. తకస్మాత్తుగా త్రొక్కి ప్రతిఘటించటంకు సమర్థించగలిగే ప్రజల భవిష్యత్తును నిర్మించటం, నవీన యుగంలో దేవాలయాల నిర్మించట మంత కష్టం. పూర్వం ఎక్కడ పడితే అక్కడ దేవాలయాలు కట్టవీలయ్యేది. ఎందుకంటే, ఆ వాతావరణమే వేరు. ఇప్పటి వాతావరణం పూర్తిగా మారిపోయింది. ఇదివరకు ఆందోళనచేసిన వారు ఇప్పుడు అధికారంలోకి వచ్చారు. కాని. ఈ సమావేశాన్ని ఏర్పాటుచేసిన వారికి ఆందోళనచేసే అలవాటులేదు. (నవ్వు) వారికి ఆందోళనా పగలం చేకొంచెం భయంకూడాను. అందుచేత చూసేటుమనీసా ఇక్కడ బల్లెములు, లాఠీలు మాత్రమే కనిపిస్తున్నాయి.

నాకేమీ భయం లేదు.

నన్ను చూడటానికి త్రోసుకొని వచ్చే జనాన్ని బలవంతాన పోలీసులు వెనక్కి నెడుతున్నారు. బహుశా నన్నెవరైనా చంపేస్తారేమోనని మీరు జాగ్రత్తతీసుకొంటూ వుండవచ్చు. కాని నాకు కొంచెమాత్రమైనా భయంలేదు. పైగా, గవర్నరు జనరలు హోదాలోని మనిషి భయపడ వలసిందేమిటంటే,' ఆయనగారి మాటలు కాదు ఎవరిమీద నుంచైనా పోవచ్చు. అయితే ఎక్కడ కట్టడిట్టాలు చెయ్యాలి, ఎక్కడ అక్కర్లేదు అన్న విషయం, ఎక్కడ గోడకట్టాలి, ఎక్కడ కిటికీలు, ద్వారాలు పెట్టాలి అన్న విషయం నిర్ణయించటం కొంచెము కష్టమే.

ఎస్. పద్మజానాయుడును చూస్తే ఆమె జనని సరోజనీ నాయుడు జ్ఞాపకం వస్తున్నారు. 30 ఏళ్ళ క్రిందట శ్రీమతి సరోజనీ కంజీవరం వచ్చినది. అది మొదటి యుద్ధపు రోజులు. అక్కడ జరిగిన మహాసభలో బ్రిటనుకు ఇండియా యుద్ధంలో సహాయ పడాలా, అయితే ఎంత వరకూ సహాయం చెయ్యాలి, లేక సహాయం చెయ్యకూడదా, అయితే ఏ విధంగా సుమీ? అన్న సమస్యలపై చర్చజరిగింది. శ్రీమతి సరోజనీ ఆసభ కధ్యక్షురాలు. అప్పుడు యెంత హోరాహోరిగా చర్చజరిగిందంటే పెద్ద అలజడి, గోల, గలభా కలాటా వరకూ వచ్చింది. సరోజనీదేవి లేచి మందలిస్తూ తీవ్రంగా అన్నదిల్లా:

"నేను ఒక నాగరికమైన నగరమునుండి వచ్చానని గుర్తుంచుకోండి. నన్ను ఆహ్వానించినవారు, నాకు ఆతిథ్యం యిచ్చిన వారు కాస్త మర్యాద, మంచిచెడ్డ తెలిసినవారు అనుకున్నాను. నేను మర్యాద, మంచి ప్రవర్తనకు అలవాటు పడిన దానిని," నేను వెంటనే లేచి ఏ వూరు మీదని అడిగాను. ఆమె సగర్వంగా "మాది హైదరాబాదు" అన్నది. (హర్షం)

మీ ఉభయనగరాలనూ కాపాడే విధిగా మీరామెను భావించండి. మీనగరాల కీర్తిని ఆమె ఇండియా అంతటా వ్యాపింపజేసింది. ఇక్కడి పౌరులు ఎంత ఉదారులు, మర్యాదపరులైనదీ ఆమె నలువైపులా చాటి చెప్పింది. ఆ కీర్తిని మీరు నిలబెట్టుకోవాలి. నేనీమాటను ఈ గందరగోళపు తమాషాను ఉద్దేశించి చెప్పటంలేదు. శతాబ్దాల తరబడి సంఘజీవనంవల్ల ఈ నగరాల ప్రజలు ఒక క్రమమును, మర్యాదను, సంస్కారాన్ని నిర్మించగలిగారని సరోజనీదేవి గర్వపడినది. తుణికో దేశాలవల్ల శాశ్వత విషయాలు దెబ్బతినకుండా మీరు చూడాలి.

పెళ్ళి చెయ్యాలనుకున్నప్పుడు మనం అందమైన పందిళ్లు వేసుకుంటామనుగాని, కిటికీలు, దర్వాజాలు పీకి పారవెయ్యము. సంస్కారం శాశ్వతమైనది. తాత్కాలిక కారణాలకోసం దానిని భ్రష్టం చెయ్యరాదు. శతాబ్దాలతరబడి మీ రెండు పట్టణాలు నిర్మించిన నాగరికతను, అభ్యుదయమును మీరు పాడుచెయ్యక, పరిరక్షించవలసిందని నా విజ్ఞప్తి.

గ్రామాలను అభివృద్ధి చెయ్యాలని సామాన్యంగా ఈ రోజుల్లో ప్రతివాయకుడూ అంటున్నాడు. గ్రామాలు ముఖ్యాతి ముఖ్యములని, నగరాల్లో పట్టణాల్లో నివసించే ప్రజలకు కావలసిన జీవనాధారవస్తువులు గ్రామాలే సరఫరాచేస్తాయని అందరూ ఒప్పుకుంటారు. కాని నగరాలు, పట్టణాలు నిర్వహించవలసిన బాధ్యతకూడాముఖ్యమైనదే. పారిశుద్ధ్యం, క్రమశిక్షణ, మర్యాద, విద్య అందమైన భవననిర్మాణం మొదలైన వాటిల్లో ఆవే మార్గం చూపించాలి. గ్రామాలన్నీ నగరాల, పట్టణాల మార్గాన్ని అనుసరించాలి. ఇది ప్రాచీనకాలంనుండీ అనూచానంగా వస్తున్నదే. రామాయణం చదివినట్లయితే, అయోధ్యా పట్టణాన్ని అభివృద్ధి చెయ్యటాన్ని దాన్ని గ్రామాలకు మార్గదర్శకత్వం చెయ్యటానికి, ఎంత కృషి జరిగిందో తెలుస్తుంది."

కనుక నగరవాసులు గ్రామాలకు ఉత్తమ జీవనమంటే ఏమిటో ఉదాహరణ చూపాలి. మనం సాధారణంగా, పూర్వపు రాజులను, నవాబులను నాగరికతా కూసుల్ని భావిస్తాము. కాని నగరాలను, పట్టణాలను ఎక్కడ, ఏపద్ధతిలో నిర్మిస్తే ప్రయోజనకరంగా వుంటుందో వారికి తెలిసినంత మనకు తెలియనే తెలియదు. నగరాలు నిర్వహించే పాత్ర వారికి బాగా తెలుసు. గ్రామస్థులు తాము పండించిన దానిని పట్టణవాసులకు తేలిగ్గా సరఫరా చేయుటానికి వీలుగా ఒక మధ్యప్రదేశంలో పట్టణాలు కట్టేవారు. రాకపోకలకు అనువైనచోట, నదీ, తటాకజలం సమృద్ధిగా వున్నచోట పట్టణాలు నిర్మించేవారు. మార్కెట్లకు అందమైన శాలలు కట్టేవారు. హైదరాబాదును ఈ దృష్ట్యా పరిశీలిస్తే ఈ నగరం ఇక్కడ కట్టటంలో వుండే తెలివితేటలు బోధపడుతాయి. కర్నూలు, బళ్ళారిజిల్లాల నిప్పులు కురిసే మైదానాల్లో నడిచే వారికి ఇంత దగ్గరలో చక్కని శీతోష్ణస్థితి కలిగిన నగరం వున్నదని ఊహించటంకూడా కష్టం.

ప్రస్తుతం భారతప్రభుత్వం రక్షణాగ్గల నిమిత్తం పట్టణాలు కట్టదలచుకున్నది. కాని అయ్యే ఖర్చును తలచుకుని వారు గాబరాపడుతున్నారు. ఈ రోజుల్లో ఎంత చిన్నపట్టణం కట్టాలన్నా దాని వ్యయభారం ప్రజలమీద పన్నుల రూపంగా పడుతుంది. పూర్వపు రోజుల్లో నగర నిర్మాణ వ్యయభారానికి ఎవ్వరూ జడిసేవారే కాదు. గ్రామాలే మంచివి అనే వాదం, చాలమటుకు నగర నిర్మాణక్రమ అంటే కల భయంవల్లనే.

నేను చాల నగరాలు చూశాను కాని ఇన్ని అందమైన భవనాలు ఎక్కడా చూడలేదు. బెంగుళూరు అందమైనదే. న్యూఢిల్లీలో కూడా చాల మంచి భవనాలున్నాయి. కాని అవన్నీ ఒక మ్యూజియముగానే వుండి విసుగుపుట్టిస్తాయి. ఏభవనం ఏదో కనిపెట్టడం కష్టం. ఐతే ప్రభుత్వ భవనమేదో నేను కనిపెట్టగలననుకోండి. అయినా వేనొక మాయాలు ఇంట్లో వుంటూ, రెండోసారి ప్రభుత్వ భవనానికి వెళ్ళాలనుకుంటే చాల కష్టంమీద కనుక్కోవలసివస్తుంది. అన్నీ ఒకేమాదిరిగా వుండి వైవిధ్యం, ప్రత్యేకత కొరవడ్డాయి వాటిల్లో. కాని హైదరాబాదులో అలా కాదు. నిన్న నేను నిజాంతో కలిసి కారులో వెడుతుండగా, ఒక భవనం చూపించి ఇది మసీదా? అని అడిగాను. 'కాదు యూనాని ఆస్పత్రి' అన్నారు. అది జామా మసీదుగా మార్చదగినంత అందంగావుంది. (నవ్వు) నాకు మద్రాసులో జనరల్ ఆస్పత్రి జ్ఞాపకంవస్తున్నది. అందమైన భవనంలో ఆస్పత్రి యెందుకు పెట్టకూడదో ఇక్కడ మాదిరిగా, నాకర్థంకావటంలేదు. తర్వాత నేను నిజామును 'అది దేవాలయమా?' అని అడిగాను. 'కాదు హైకోర్టు' అని ఆయన అన్నారు. హైకోర్టుకు అంత మంచి భవనం అనవసరమనిపించింది. (నవ్వు) అయితే న్యాయనిర్వహణం దేవాలయాల్లో జరగటం చాలా బాగుంటుంది.

మీ సంస్థానాన్ని గూర్చి మీరు గర్వపడాలి. అది శిథిలం కావలసినంత ప్రాచీనంకాదు, కాని మీకు ప్రబోధం ఇవ్వగలిగినంత ప్రాచీనంమీసంస్థానము."

తనరాక సందర్భంలో శాంతిభద్రతలు కాపాడటానికై చేయబడిన ప్రయత్నాలను గూర్చి రాజాజీ ఇంకా ఇలా ప్రస్తావించారు.

"నేనొక పూజారిని మాత్రమే. నన్నెవ్వరూ చంపరు. నేను గవర్నరు జనరల్‌ను. నన్ను చంపటంవలన ఎవ్వరూ లాభంపొందరు. అయినా మనిషిని చావునుండి ఎవరు తప్పించగలరు? మహాత్మాగాంధీ తన ఇంటి నుండి, తన ప్రార్థనాస్థలమునకు వెళ్ళారు. కాని దేవుడు ఆయనను తీసుకుపోవలసిన తరుణంవచ్చిందని తీసుకువెళ్ళాడు. రక్షణ ప్రయత్నాలన్నీ సరిగా చేశారు. అయినా హత్య జరిగింది.

అయితే గవర్నరు జనరలు విషయమై నేను చెప్పేది, మంత్రులకు వర్తించదు. వారిని ఎప్పుడూ రక్షిస్తూ వుండాలి. ప్రభుత్వనిర్వహణలో మంత్రులు నిష్పక్షపాతంగా, కఠినంగా ఉండవలసివస్తుంది. ఒక సీసాలోని నీటిని మరొకసీసాకు మార్చాలంటే మొదటిసీసాను ఖాళీచేయవలసి వస్తుంది. ఇది పరిపాలనకుకూడా వర్తిస్తుంది. నేను మళ్లీ యీసారి హైదరాబాదువచ్చినప్పుడు ఈ పోలీసులు, సైనికులు నాకు కాపలాగా ఉండరని భావిస్తున్నాను. బహుశా గవర్నరు జనరలుకేదైనా అపాయం జరుగుతుందేమో, అలాంటి అపాయం జరగకుండా తమ్ము రక్షించుకోవాలని అధికారులు భావించి ఈ ఏర్పాట్లు చేసివుండవచ్చు. ఇంతా అయితే నేనెవరిని? గవర్నరు - జనరలును కేవలం ప్రజలకు స్నేహితుణ్ణి తత్వబోధకుడిని, మార్గదర్శకుడిని. నేను ప్రజలను సన్నిహితంగా కలుసుకోవాలి.

ఇంత మాత్రాన నేను ఈ ఆధునిక యుగంలో పోలీసుల అవసరంలేదని అనటంలేదు. వారిది చాలా కష్టమైనపని. గొంతెత్తయజమానులక్రింద పోలీసులు, సైనికులు ఎంత శ్రమపడుతున్నారో రాజకీయవేత్తలు ఒకొక్కప్పుడు బాగా గ్రహించటంలేదు. పోలీసులు, సైనికులు చేసే పని నిజంగా ప్రశంసావహమైనది.

నేను వదవినుండి విరమించిన తరువాత బహిరంగ సభలు ఏ విధంగా జరుగుతాయి, లోపలికి వెళ్లటం ఎల్లాగు, బయటికి రావడం ఎల్లాగు, లోపల వున్నప్పుడు ఎలా మెలిగితే లాభం అనే విషయాలపై ఒక ఉద్గ్రంథం వ్రాద్దామనుకుంటున్నాను (నవ్వు). కాని ఈలోగా ఈ చాతుర్యాన్ని అంతా ప్రజలే నేర్చుకుంటే నా పుస్తకం వృథా అవుతుంది."

రాజాజీ లోనుండి బయటికిరాగానే అక్కడి గ్రోపులాబలో నిముస్నులైన వేలాదిజనం హర్షధ్వానాలు చేశారు. టాపుతీసిన కారులోనుంచుని కొద్ది నిమిషాలసేపు రాజాజీ చేతులుజోడించి ప్రజలకు నమస్కరించారు. (స్వ. వి.)

## గుడివాడ మునిసిపల్ చైర్మన్‌పై ఆరోపణలు

### రాష్ట్రకాంగ్రెస్ నియమించిన విచారణకర్త విచారణ

గుడివాడ, డిసెంబరు 20: ఈ పురపాలక సంఘాధ్యక్షుడు గోనుగుంట సుబ్రహ్మణ్య గుప్తాగారి పై ద పు. పా. సంఘ సభ్యులు కొందరు చేసిన ఫిర్యాదులను విచారణ చేయుటకు రాష్ట్ర కాంగ్రెసు నియమించిన ఈడుపుగంటి శివమూర్తి గారు నిన్న ఇక్కడకు వచ్చిరి. తాలూకా కాంగ్రెసు ఆఫీసునందు విచారణ జరిపిరి. విచారణకు పురపాలక సంఘ సభ్యులందరు హాజరైరి. పట్టణ కాంగ్రెసు అధ్యక్షులు, కార్యదర్శులు కూడా హాజరైరి. గుప్తా గారిమీద లంచగొండితనం ఇటీవల 10 వ వార్డుకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు వ్యతిరేకప్రచారం మొదలైన ఆరోపణలతో 14 మంది సభ్యులు సంతకములు చేసిన పిటీషను ఒకటి శివమూర్తిగారికి అందచేయబడెను. శివమూర్తి గారు ఈ 14 మంది సభ్యులను పట్టణ కాంగ్రెసు అధ్యక్ష, కార్యదర్శులను ప్రశ్నలు వేసి వారి వాఙ్మూలములను రికార్డు చేసికొనిరి.

## డెల్టా పశు ప్రదర్శనం

కొత్తపేట (తూ. గో. జిల్లా) డిసెంబరు 16 డెల్టా పశు ప్రదర్శనము వచ్చే జనవరి 1-న ఇక్కడ జరుగుతున్నది. టిక్కన వీరాస్వామి (ఎం. ఎల్. సి.) గారు ప్రారంభోత్సవం జరుపుతారు. నడింపల్లి రామభద్రరాజు (ఎం. ఎల్. సి.) గారు బహుమతులు పంచి పెడతారు. ప్రదర్శనానికి పశువులను తీసుకు రాదలచిన వారు అరోజు ఉదయం 7 గంటలలోపున తమ పేర్లు ప్రదర్శన సంఘ కార్యదర్శి, డాక్టరు పక్షివోలు రామమూర్తి గారి వద్దనమోదు చేయించుకోవలెను. వివరములు వారి వద్ద నుండి తెలుసుకో వచ్చును. అని ప్రదర్శన వ్యవస్థాపకుడు, వెటర్నరీ డాక్టరు ఎ. మహాదేవ రెడ్డి గారు వ్రాశారు.

### గ్రామసేవక విద్యాలయం

ఆనందాశ్రమం, డిసెంబరు 17: ఈ మాసం 24-న ఇక్కడ గ్రామసేవక విద్యాలయం ప్రారంభోత్సవం జరుగుతుంది. గాడిచర్ల హరి సర్వోత్తమ రావు గారు ప్రధానాచార్యులుగా వుంటారు. రాష్ట్ర ఫిర్కా అభివృద్ధి శాఖాధికారి జి. వెంకటచలపతి గారు ప్రారంభోపన్యాసము, ప్రాంతీయ ఫిర్కా అభివృద్ధి అధికారి వి. రాఘవరావుగారు పతాకోత్సవం చేస్తారు.

## ఉద్యోగ వార్తలు

మదరాసు, డిసెంబరు 21: శ్రీ సి. రామచంద్రన్ ఐ. సి. యస్. చిత్తూరు జిల్లా కలెక్టరుగా శ్రీ యస్. సుబ్రహ్మణ్యం ఐ. సి. యస్.కి బదులు నియమించబడిరి.

శ్రీ యస్. సుబ్రహ్మణ్యం ఐ. సి. యస్ ను విధులలనుండి 4 నెలలు శెలవొసగిరి.

శ్రీ కె. కొండలరావు శెలవు అనంతరం విశాఖపట్నం ట్రెజరీ డిప్యూటీ కలెక్టరుగా నియమించబడిరి.

సాయుధ పోలీసుదళ కమాండెంటు నెల్లూరుజిల్లా పోలీసు సూపరింటెండెంటుగా శ్రీ యం. కృష్ణమూర్తినాయుడు గారికి బదులు నియమించబడిరి.

### ప్రభుత్వ కుటీరపరిశ్రమల డిపో సందర్శనం

హైదరాబాదు, డిసెంబరు 20: నేటి ఉదయం గవర్నర్ జనరల్ రాజాజీ ప్రభుత్వ కుటీర పరిశ్రమల డిపోను దర్శించారు. సంస్థాన ముఖ్యమంత్రి వెల్లోడి గారితో కలిసి 25 నిమిషాలసేపు డిపోలోని అన్ని కొట్లనూ చూస్తూ అక్కడి వస్తువుల కల్పనాసైపుణ్యాన్ని చాల మెచ్చుకున్నారు.

"ఈ వస్తువులలోని కళ చాల ప్రశంసనీయంగా ఉన్నది. ఇందులో పాల్గొన్న అందరికీ విజయం చేకూరుగాక అని ఆశిస్తున్నాను." అని రాజాజీ అన్నారు.

రాజాజీ తర్వాత తన కుమార్తె శ్రీమతి నామగిరితో కలిసి దివాన్ బహదూర్ ఎస్. అరవముదయ్యంగార్ గృహమునకు వెళ్ళారు. అయ్యంగార్ రాజాజీకి ఎదురేగి పూర్ణకుంభంతో వేదమంత్రాలు చదువుతూ తోడ్కొని వచ్చారు. అల్పాహార విందు జరిగిన తర్వాత రాజాజీ దివాన్ బహదూర్‌తోను, వారి కుటుంబంతోను, కలిసి ఫోటోతీయించుకున్నారు. పిరంటేలో 20 నిమిషాలు గడిపి, పిమ్మట ఫలుక్నామా కోటకు వెళ్ళిపోయారు.

## మంత్రులతో ఇష్టాగోష్ఠి

హైదరాబాదు ప్రభుత్వ మంత్రులతో నేటి సాయంకాలం రాజాజీ 1 గం సేపు ఇష్టాగోష్ఠి జరిపారు. తర్వాత మిస్ పద్మజానాయిడు నాట్యప్రదర్శనాన్ని అరగంటసేపు రాజాజీ వీక్షించారు. నాట్యం చాలా బాగుందని రాజాజీ మెచ్చుకున్నారు.

# 'హైదరాబాదు విభక్తం కారాదని ఆశిస్తున్న నిజాం కోరిక సహేతుకం'

## గవర్నరు జనరల్ రాజాజీ ప్రకటన

హైదరాబాదు, డిసెంబరు 21: "మూడు శతాబ్దాలనుండి తన ఐక్యతను, ప్రత్యేకతను నిలబెట్టుకున్న హైదరాబాదు సంస్థానం ఇక ముందుకూడా ఏకఖండంగా ఉండి భారతరిపబ్లిక్‌లో సముచిత గౌరవస్థానాన్ని సంపాదించాలని, సంస్థానప్రజలు సుఖులై వుండాలని మాత్రమే నిజాంనవాబు ఆశిస్తున్నారు. దేశమంతా అల్లకల్లోలంగా ఉన్న రోజుల్లో ఈ సంస్థానాన్ని స్థాపించి నిలబెట్టిన వంశంవారికి చెందిన నిజాము నవాబు ఈ కోరిక సహజము, సహేతుకము." అని గవర్నరు జనరల్ రాజాజీ నేడిక్కడ అన్నారు.

తమగౌరవార్థం జరిగిన గొప్పవిందులో ప్రసంగిస్తూ రాజాజీ ఇంకాఇలా చెప్పారు.

"భారత రిపబ్లిక్‌లో హైదరాబాదు చేరవలెనన్న నిర్ణయం నిజాం స్వతంత్రంగా, సంపూర్ణంగా ఆలోచించినవిదట చేసినదేనని నా విశ్వాసము. హైదరాబాదుకు వివేక వంతుడు, నిత్యసంతోషి, ఆశావాది, వినమ్రుడు అయిన అధిపతి ఉన్నారు. ఆయన వివేకం, సామర్థ్యమె ఏ ఇతరభారతరాష్ట్రీయ గవర్నర్లకు తీసిపోదు. అయిన విస్వాస్యుడు. ఆయన కేవలం తన లాభంకోసమే ఏదైనా సంకల్పిస్తున్నారని ఎవరైనా భావిస్తే అదిపొరబాటని చెప్పక తప్పదు."

సంస్థాన ముఖ్యమంత్రి ఏర్పాటుచేసిన ఈ విందుకు సుమారు వెయ్యిమంది అతిథులు హాజరయ్యారు. విశాలమైన పబ్లిక్ గార్డెన్స్ పచ్చికమైదానంలో విందు జరిగింది. ఎప్పుడూ ఏ విందుకూ రాని నిజాము కూడా హాజరయ్యారు. స్వామి రామానందతీర్థ, సోషలిస్టు నాయకుడు బి. ఎస్. మహాదేవసింగుకూడా వచ్చారు.

రాజాజీ శ్రీమతి నామగిరితో కలిసి వచ్చి అతిథులందరి మధ్యాస్వేచ్ఛగా తిరుగుతూ కేలోస్తులాడారు. పోలీసు ఇన్స్పెక్టరు జనరల్ బి. ఎస్. జెట్లీ ప్రశంసావహసేవకు నిజాం మెడల్‌ను రాజాజీ బహూకరించారు.

రాజాజీ ఇంకా ఇలా ప్రసంగించారు. "సంస్థానానికి మంచి జరిగినా, చెడు జరిగినా అది నిజాము బాధ్యత కాదు. ఆయన రాజ్యాంగరీత్యా అధిపతి మాత్రమే. పూర్తిబాధ్యత ప్రజలు ఎన్నుకున్న శాసన సభ్యులద్వారా అధికారానికి వచ్చే మంత్రులుమీదనే ఆధారపడి వుంటుంది. ఈ సంస్థానంలో పరిస్థితులు చక్కదిద్ది వత్రా త్వరితగాని ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పరాదని నా ప్రభుత్వం చేసిన నిర్ణయం, వారి విధానం సక్రమము, వివేకవంతము అని నేను భావిస్తున్నాను. ఇక్కడి నాయకులు, ప్రజలు కూడా ఈ విధానాన్ని హర్షిస్తూ, ఆందోళన వీమాత్రం పడనందుకు నేను సంతోషిస్తున్నాను. సంస్థాన మంత్రులుగా నియమింపబడినవారుకూడా తమ కర్తవ్యం బాగా తెలిసినవారేననటంలో సందేహం లేదు.

నేను నిజాం నవాబుగారికి ఆయురారోగ్య సౌఖ్యములు వర్ధిల్లవలెనని ప్రార్థిస్తున్నాను."

### నిజాం స్వాగతం

నిజాం నవాబు రాజాజీకి స్వాగతమిస్తూ ఇలా మాట్లాడారు.

"హైదరాబాదు సంస్థాన రాజధానికి మిమ్ములను సంతోషపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను ఇది మీ మొదటిసారి రాక కాదు. అయినప్పటికీ గవర్నరు జనరలుగా మీరు రావటానికి ఇదే మొదటిసారి. స్వతంత్రభారత గవర్నరు జనరలు ఇక్కడికి రావటానికికూడా ఇదే మొదటిసారి. ఈ రెండు విధాలా మేము ధన్యులమైనాము.

రాజ్యాంగరీత్యా మేము స్వతంత్ర భారతంలో విలీనమైనందుకు నా సంతోషం పట్టలేకుండావున్నాను. నూత్న రిపబ్లిక్ వ్యవస్థలో ఈసంస్థాన ప్రజలుకూడా తమకు తగిన పాత్రను నిర్వహించి పురోభివృద్ధి పొందుతారని నేను విశ్వసిస్తున్నాను

మిలిటరీ ప్రభుత్వంద్వారా ఈ సంస్థానంలో ఇంత త్వరలో శాంతిభద్రతలను పునఃస్థాపించ గలిగినందుకు మీ ప్రభుత్వాన్ని కొనియాడుతున్నాను. మేజర్ జనరల్ జె. ఎన్. చౌధురిగారు, ఆయన సహచరులతో కలిసి సంస్థానంలో శాంతిని, సామరస్యాన్ని నెలకొల్పి గణనీయమైన సేవచేశారు. చౌధురిస్థానంలో అనుభవజ్ఞుడు, సమర్థుడు అయిన ఐ. సి. ఎస్.ను ఇప్పుడు నియమించినందుకు కూడా మిమ్ము నేను కొనియాడుతున్నాను. ఎమ్. కె. వెల్లోడి సమర్థతతో బాధ్యతలన్నిటినీ నిర్వహించగలరని నమ్ముతూ ఆయనకు నా సంపూర్ణ సహకారం వాగ్దానం చేస్తున్నాను.

మీరు ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిషత్తులో ప్రసంగించటానికి క్రిందటి సారి రావటం నాకు బాగా జ్ఞాపకమున్నది. మీరీ పరిషత్తును భారతవ్యవస్థ పరిషత్తు అన్నారు. ఈ పరిషత్తు ఇంకా సమర్థంగా సాగటానికి గాను నేటినెల చాన్సెలర్ సలహాతోను, నా ప్రభుత్వామోదంతోను ప్రణాళికలో కొన్ని మార్పులు చేశాను.

ఇది మీ మొదటి రాక కానందున, తుది రాక కూడా కాదని తలుస్తున్నాను. హైదరాబాదు ప్రజలు మిమ్ము అధికారంలో ఉన్నా, లేకపోయినా సల్లప్పుడూ విస్తారిత బాహువులతో ఆహ్వానిస్తారు. భారత స్వాతంత్ర్యం కోసము మీరు చేసిన త్యాగము, మీ రాజనీతి చతురత, సంస్కారము, మీరు ఈరోజ ప్రజల గౌరవాన్ని, మీపదవిని అర్హమైనదిగా చేస్తున్నాయి."

### పత్రికా విలేఖరులతో గోష్ఠి

రాజాజీ ఫలుక్నామా కోటకు తిరిగి వచ్చిన తర్వాత దాదాపు 30 మంది పత్రికా ప్రతినిధులు, సంపాదకులతో 45 నిమిషాలసేపు గోష్ఠి జరిపారు. ప్రశ్నలు గాని, నోటుపుస్తకంగాని తీసుకురావద్దని ముందు హెచ్చరించారు. ఎమ్. కె. వెల్లోడి, సమాచారశాఖ డైరెక్టరు ఓనోద్ రావు గర్గకూడా హాజరయ్యారు.

రాత్రికి నిజాం ఏర్పాటుచేసిన మరొక విందుకుకూడా రాజాజీ వెళ్లారు.

### వివిధ సంస్థల ప్రతినిధులతో గోష్ఠి

నేటి ఉదయం ఫలుక్నామాలో స్థానిక జమియతుల్ ఉలేమా ప్రతినిధులకు రాజాజీ దర్శనమిచ్చారు. అధ్యక్షుడు మౌలానా హమీదుద్దీన్ కమర్, కార్యదర్శి అన్వర్ ఖాన్, ఈ ప్రతినిధుల్లో ఉన్నారు. 30 నిమిషాలసేపుగోష్ఠి జరిగింది. ప్రతినిధులిచ్చిన వినతిపత్రంలో హైదరాబాదు ఎదుర్కొంటున్న వివిధ సమస్యలనుగూర్చి, ముస్లిముల పునరావాసాన్ని గూర్చి, దేవాలయాలను, మసీదులను పునస్స్వాధీనం చేయుటాన్ని గూర్చి వారు వివరించారు.

హైదరాబాదు షెడ్యూల్డు కులముల ఫెడరేషను అధ్యక్షుడు జె. హెచ్. సుబ్బయ్యగారుకూడా రాజాజీతో 25 నిమిషాల సేపు సంభాషించారు.

పిమ్మట సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుడు స్వామీ రామానంద తీర్థ, దిగంబరరావు బిందూ, బి. రామకృష్ణరావు, డా॥ జి. ఎస్. మేల్కోటే గార్లుకూడా రాజాజీని దర్శించారు. అరగంటసేపు జరిగిన ఈ గోష్ఠిలో కాంగ్రెసు నాయకులు, సంస్థాన పరిస్థితులనుగూర్చి, ముఖ్యంగా కమ్యూనిస్టు ప్రమాదాన్ని గూర్చి, రాబోయే సంస్థానరాజ్యాంగ పరిషత్తు ఎన్నికలనుగూర్చి అనధికారరీత్యా చర్చించారని తెలుస్తున్నది.

పిమ్మట భారతీయ క్రైస్తవుల తరఫున రివరెండ్ సుందరం నాయకత్వాన వచ్చిన ప్రతినిధివర్గంతోకూడా రాజాజీ పావుగంట సేపు సంభాషించారు. స్వ. వి.

# మేడిశెట్టిగూడెం వర్తకుని దారుణ హత్య

## హైద్రాబాద్ కమ్యూనిస్టుల ప్రసాద్‌దళం ఘాతుకం

### దోపిడి అయిన సొత్తు కొంత దొరకుట: ఆర్గురు కోయల అరెస్టు

ఏలూరు, డిసెంబర్ 21: 'ప్రసాద్ దళం' అనే హైదరాబాదు కమ్యూనిస్టు ముఠా మొన్న 15 న హైదరాబాదు సరిహద్దుకు చేరవగా ఉన్న చింతలపూడి తాలూకా మేడిశెట్టిగూడెంలో అడపా రాజయ్య అనే వర్తకుని తుపాకితో కాల్చి చంపినట్లు వార్తవచ్చింది.

ఈ వర్తమానం వినగానే పోలీసు సూపరింటెంటు డబ్ల్యు. కార్ల్‌సన్, డిప్యూటీ సూపరింటెంటు, ఎ. మురుగేశన్, పోలీసు ఇన్స్పెక్టరు పి. బి. రమణారావు గార్లు రిజర్వుదళాన్ని వెంటబెట్టుకుని ఆ గ్రామానికివెళ్లారు.

ఈ సందర్భంలో ఈ దిగువ విషయాలు తెలిసినవి.

హత్యకు గురియైన ఈ రాజయ్యకు హైదరాబాదు సంస్థానంలో రాళ్ళబంజరు అనే చోట 28 ఎకరముల పల్లపు భూమి ఉన్నదట. కొంతకాలం నుంచే, ఆ ప్రాంతాలలోని కమ్యూనిస్టు దళం వారు ప్రజలెవ్వరూ ప్రభుత్వానికి ధాన్యపులెవి యివ్వరాదనీ, అలా యిచ్చిన వారి పని పట్టెదమని ప్రచారం చేస్తున్నారట. 14-న తేదీననే రాజయ్య తన పొలంలో పండిన 72 బస్తాల ధాన్యం, సంస్థాన అధికార్లకు లెవీ క్రింద చెల్లించెనట. హత్యకు ఇదొక కారణమని ఊహింపబడుచున్నది.

హత్య జరిగిన రాత్రి నెందూరి ప్రసాదరావు నాయకత్వాన ప్రసాద్ దళం వారు కొందరు కోయల సహాయంతో రాజయ్య యింటిని ముట్టడించి, సుమారు 3000/- కిమ్మతుగల ఆస్తిని ముఖ్యంగా అతని దుకాణంలోని కొత్త బట్టలను దోపిడి చేసారట. పైగా అతనిని 5000/- యివ్వమని నిర్బంధించి, అతను యివ్వజాలనని చెప్పినందున తుపాకితో కాల్చి చంపారని తెలియుచున్నది.

పోలీసువారు దురదపాడుఅనే కోయ గ్రామాన్ని ముట్టడించి కోయల వద్ద నుండి సుమారు రు 2000/- విలువగల చోరీ అయిన బట్టలు తిరిగి స్వాధీనము చేసికొన్నారనీ, 6 గురిని అరెస్టు చేశారనీ తెలిసింది.

## చిరికురాలలో క్రూరకృత్యాలు

విజయవాడ, డిసెంబరు 22: కృష్ణా జిల్లా సరిహద్దునగల హైదరాబాదు సంస్థాన గ్రామాల ప్రజలు, చిరికురాల గ్రామంలో ఇటీవల కమ్యూనిస్టులు జరిపిన క్రూరకృత్యాలవల్ల భీతావహులై ప్రాణాలు కాపాడుకొనేందుకు ఈ జిల్లా గ్రామాలకు తరలివస్తున్నట్లు తెలిసింది.

సుమారు 12 మంది సాయుధ కమ్యూనిస్టులు చిరికురాల గ్రామంమీదికి పోయి, రెడ్డి దోచుకొన్నారట. వీరు ఎస్. ఎ. పి. ఖాకీదుస్తులలో వున్నట్లు తెలిసింది. ఆ గ్రామస్థుడైన కె. గురవయ్యను పార్టీ నిధికి విరాళ మియ్యవలసిందని నిర్బంధించారట. అతడు అంతమొత్తం ఇవ్వలేనని అనగా అతని ఎడమ చేయి తెగగొట్టి వేశారట. అప్పటికీ అతడు ఆసొమ్ము ఇవ్వనిరాకరించగా కాల్చి చంపివేశారట. అతని కొడుకుల కండ్లు పీకివేయుటకు ప్రయత్నించి, గాయపరచారట.

దీనికిముందు ఆ ముఠాయే, సాయంత్రం 7-30 ప్రాంతాల, ఆ వూరికి ఒక మైలులో వున్న నల్లబండ గూడెంవద్ద ప్రయాణీకుల బస్సుపై కాల్పులు జరిపారట.

ఈ కృత్యాలకు భయపడి ఆ ప్రాంత ప్రజ ఈ జిల్లా జగ్గయ్యపేట మొదలయిన గ్రామాలకు తరలిపోతున్నారు. అధికారులు, సరిహద్దు బందోబస్తు పోలీసులను, కమ్యూనిస్టులు సరిహద్దు దాటిరాకుండా జాగ్రత్తవహించవలెనని హెచ్చరించారు.

## రాజాజీకి నిజాం స్వీయ కావ్య బహూకృతి

సికిందరాబాదు, డిసెంబరు 22: నేటి మధ్యాహ్నం గవర్నరు జనరల్ రాజాజీకి నిజాంనవాబు తాను స్వయంగా రచించిన ఒకపర్షియన్ కావ్యాన్ని బహూకరించారు. ఒక గీతాన్ని ఇంగ్లీషులోకి అనువదించమని కోరగా నవాబు తర్జుమాచేశారు. దాని అర్థం ఇది.

"అన్ని మతాలూ జీవిత పరమార్థాన్నే బోధిస్తాయి. ప్రపంచంలోని దోషాలను కడిగివెయ్యమనే వాటి సారాంశం. మానవసేవ చేసే వ్యక్తి హృదయంలో ద్వేషానికి తావుండదు. భగవదనుగ్రహం పొందిన ఉస్మాన్ ప్రవచన మిదే."

పర్షియన్ కవిగా పేరుపొందిన నిజాముకు మారు పేరు (కలంపేరు) ఉస్మాన్.

సమాంనంకి మదరాసు రాష్ట్రం కొరకు 5245టన్నుల బియ్యం కొచ్చిన్ రేవులో 17 తే. దిగినవి.

# మదరాసు అసెంబ్లీ

## విలీనమైన సంస్థానములకు శాసనముల వర్తింపుబిల్లు ఆమోదం

చెన్నపట్నం, డిసెంబరు 21: మద్రాసు అసెంబ్లీసభ యీవాళ స్పీకరు శ్రీ జె. శివ షణ్ముగంపిళ్ల గారి అధ్యక్షతను సమావేశమై ప్రశ్నోత్తరముల అనంతరం న్యాయశాఖ మంత్రి శ్రీ మాధవమీనన్ గారు విలీనమైన సంస్థానములకు చెన్నరాజధాని శాసనములను వర్తింపచేయు బిల్లును సెలెక్టుకమిటీలో సవరింపబడిన రీతిని సభవారియెదుట ప్రతిపాదించుచూ శ్రీ స్వామినాథన్ గారు కోరినప్రకారం యీ సంస్థానాలకు జమీందారీలరద్దు శాసనము వర్తింపజేయ వలసిన అవసరము లేదనిరి. మరి కొందరు సభ్యులు ఆసంస్థానములలో పన్ను భారము తగ్గించుటకు కావలసిన శాసనములను వర్తింప చేయవలసినదని చేసినసూచనకు బదులు చెప్పుచూ 1933 సంవత్సరమున భూములను సాగుచేసే హక్కు కలిగి యుండిన వ్యక్తులకే ప్రస్తుత శాసనము వర్తించగలదు గనుక సంస్థానములలో ఎంతమంది అప్పటికాలంనుండి హక్కు కలిగియున్నారనే సంగతి విచారణచేసి తెలుసుకొన్న మీదటనే తత్సంబంధమైన శాసనమును వర్తింప చేయవచ్చుననిరి.

శ్రీ వెంకటసుబ్బయ్యగారు (బంగనపల్లి) సంస్థానముల ప్రజలు చాలా వెనుకబడియున్నారనియు, వారి అభ్యుదయమునకు అనుగుణ్యమైన చర్యలు తీసుకొనుటకు కావలసిన శాసనములన్నిటిని ఆ సంస్థానములకు వర్తింపచేసి సంస్థానములను అభివృద్ధిపరుచుటకు ప్రయత్నించవలెనని కోరిరి. సాండూరుకు ధర్మాదాయముల చట్టమును వర్తింప చేయవలెననిరి.

శ్రీ నటేశన్ గారు (పుదుక్కోట) బిల్లును బలపరచిరి. యూనియన్ శాసనముల పుదుక్కోట సంస్థానమునకు వర్తింప చేయునపుడు సంస్థానపు ప్రజలబాగోగులను గమనించి అచ్చటి పరిస్థితులను బాగు పరచులాగున ప్రభుత్వము పరిపాలనసాగించవలెననిరి.

శ్రీ కాశీశ్వరరావుగారు బిల్లును బలపరుస్తూ విలీనమైన సంస్థానముల ప్రజల ఆర్థిక స్థితిని బాగుపరచే కార్యమునకు ప్రాధాన్య మివ్వవలెననిరి. సంస్థానములలో సంస్థానాధీసులు సర్వాధికారములను చెలాయించుచుండిరి గనుక ప్రజలను నిరంకుశముగా అణగద్రొక్కి యుండిరనియు ప్రభుత్వమువారా సంస్థానములను యిపుడు తీసుకొని యున్నందున ఆ సంస్థానములు యితర భాగములవలె ఆదర్శముగా పాలింపబడుట అవసరమనిరి.

శ్రీ నివర్తి వెంకట సుబ్బయ్యగారు బిల్లును సెలెక్టుకమిటీకి మొన్న శాసనం యీవాళ ఆకమిటీచేసిన సిఫార్సును ఆలోచించవలెనని తొందరపరచడం సరి కాదనియూ, బిల్లు షెడ్యూలులో నిర్వచింపబడిన సుమారు వంద శాసనములు సంస్థానములందలి ప్రత్యేక పరిస్థితులకు యేరీతిగా వర్తింప వీలగుననే విషయము క్షుణ్ణముగా ఆలోచించి చేయవలెను గాని యీ బిల్లు తొందరతో యీవిధమున ఆమోదింప చేయుటకు ప్రయత్నించుట మంచిది కాదనిరి. గ్రామాధికారుల శాసనము సంస్థానములకు వర్తింప చేయునపుడు పూర్వమునుండి పనిలోనుండిన వారికి సాధ్యమైనంతవరకు ఆ వ్యాసము కలుగనట్లు చూడవలెననిరి.

శ్రీ మునగాల పట్టాభిరామయ్య శ్రీ కే. కోటిరెడ్డిగార్లు బిల్లును బలపరచిరి.

మంత్రి మాధవమీనన్ గారు విమర్శలకు జవాబు చెప్పుచూ హిందూ ధర్మాదాయాల చట్టము యీ సంస్థానములకు యెందుకు వర్తింప చేయలేదనే విషయమై సమాధానముగా పైచట్టము బంగనపల్లి పుదుక్కోటకు వర్తింప చేయబడియే యున్నదనియు సాండూరులో దేవాలయముల పరిపాలనకు సంబంధించే ఒక ప్రశ్న మేమును అక్కడ నుండుటచేత అక్కడమాత్రం ధర్మాదాయములబిల్లు వర్తింప చేయదలచలేదనిరి. శ్రీ స్వామినాథన్ గారు యీ బిల్లును శాసనము చేయుటకు తొందరపడవలెనని ఒకవైపు కోరుచుండగా వెంకట సుబ్బయ్యగారు ప్రభుత్వము యీ విషయములో తొందర పడరాదని కోరుట తనకు అర్థమగుట లేదనిరి.

అమీద విలీనమైన సంస్థానములకు చెన్నరాజధాని శాసనములకు వర్తింప చేయు బిల్లును సెలెక్టు కమిటీ సిఫార్సులతోపాటు సభవారు ఆలోచనకు తీసుకొనవలెనను ప్రతిపాదనను సభవారు ఆమోదించిరి.

శ్రీ ఆర్. వి. స్వామినాథన్ ఇనాముల శాసనము పుదుక్కోటకు వర్తింప చేయవలెనను సవరణను ప్రభుత్వమువారు అంగీకరించని కారణమున వారు ఉపసంహరించుకొనిరి. పై మూడు సంస్థానముల ఎస్టేట్ల శిస్తుతగ్గింపు చట్టమును వర్తింప చేయవలెనని శ్రీ ఆర్. వి. స్వామినాథన్ గారు మరొక సవరణ ప్రతిపాదించుచూ సంస్థానములలో శిస్తుభారం హెచ్చుగా నుండే కారణమున యీ శాసనమునైనా తక్షణ వర్తింప చేయవలెననిరి.

మంత్రి మాధవమీనన్ గారు బదులు చెప్పుచూ సంస్థానములలో అసలు ఎస్టేట్లే లేకున్నపుడు యీ ఎస్టేట్ల శిస్తుతగ్గింపు శాసనము యేవిధముగా వర్తించునో అర్థమగుట లేదని చెప్పి సవరణను ఒప్పుకొనజాలమనిరి. తరువాత శ్రీ స్వామినాథన్ గారు సవరణను ఉపసంహరించుకొనిరి.

శ్రీ నివర్తి వెంకటసుబ్బయ్యగారు శ్రీ కాశీశ్వరరావు శ్రీ వెంకటసుబ్బయ్య (బంగనపల్లి) బిల్లు శాసనముగుటకు సంతోషమును వెలిబిపి సంస్థానములకు యీ యూనియన్ శాసనములను ఊరక వర్తింపచేయుటతో మాత్రము ప్రభుత్వము తృప్తిపడకుండా ఆ సంస్థానములను అభివృద్ధిపరుచుటకు వలయు చర్యలను కైకొనుట ముఖ్యమనిరి. అపైని బిల్లును సభవారు శాసనముగా ఆమోదించిరి.

### పంచాయతీలబిల్లు క్లాజువారిచర్చ

తరువాత సభవారు పంచాయితీల బిల్లును క్లాజువారిగ చర్చకు తీసుకొనిరి.

పంచాయితీలలో పైవిచేటు రోడ్డు అనే నిర్వచనముండుట అనవసరమని శ్రీ విశ్వనాథంగారు ప్రతిపాదించిన సవరణను ప్రభుత్వము ఒప్పుకోనందున వారు దానిని ఉపసంహరించుకొనిరి.

పంచాయితీలుగా ఏర్పడే గ్రామాలలో 5000 పైగా జనాభా యుండవలెనని శ్రీ విశ్వనాథంగారు మరొక సవరణ ప్రతిపాదించిరి.

శ్రీ లింగరాజుగారు సవరణను బలపరుస్తూ 500 జనాభాయుండే గ్రామాలలో పంచాయితీలు స్థాపించితే యింతవరకు పూర్వము పన్ను భారము వహించని సుడిసెలవారు కూడా కొత్తపన్నులను భరించవలసి వచ్చునని నుడివిరి. అంతటితో సభవారు ఫలహారమునకు లేచిరి.

మదరాసు, డిసెంబరు 21: అసెంబ్లీ మధ్యాహ్నం సమావేశమయినపుడు ఎస్. ఎస్. వరదాచారిగారు 3 వ క్లాజులో విశ్వనాథంగారి సవరణను బలపరచుచు, 8000 కాక యింకా యెక్కువ జనసంఖ్యగల గ్రామాలకు మాత్రమే పంచాయతీలు స్థాపించుట మంచిదనిరి.

గోవిందమీనన్ గారు, నటేశ చెట్టి సవరణ బలపరచిరి. గ్రామ పంచాయతీలు యిపుడు రౌడీల చేతులలో నున్నవని చెట్టిగారనిరి రౌడీ అన్న పదం సక్రమమేనా యని ఒకరడుగ, సభ్యులనుగూర్చి అన లేదని అధ్యక్షులు చెప్పిరి. కోసల రాముగారు పలనిసామి గౌండరుగారుకూడ సవరణను బలపరచిరి. మునగాల పట్టాభిరామయ్యగారు ఆర్. వి. స్వామినాథను గార్లు సవరణను ఎదిరించిరి.

కే. కోటిరెడ్డిగారు, సవరణను ఎదిరించుచు 500 జనసంఖ్యమాత్రంగల గ్రామాల సంఖ్య చాల తక్కువయుండు ననియు, పెక్కు పంచాయితీలలో యింకను ఎక్కువ జనసంఖ్యయే యుండుననియు చెప్పిరి. అక్షరజ్ఞానంలేని రణజిత్‌సింగు, అక్బరు సామ్రాజ్యాలు ఏలినపుడు, అక్షర జ్ఞానంలేనివాడు గ్రామ పంచాయతీని నిర్వహింపలేడనుట భ్రమ యనిరి. రెవెన్యూ గ్రామా లన్నింట పంచాయతీ లుండాలనిరి. ఓటరు లెంత తక్కువవుంటే అంత మంచిది. గ్రామములందు విద్య లేకున్న పంచాయతీ నిర్వహించగల అనుభవం గల వారు500గల గ్రామంలో కూడ పెక్కుమంది యుందురనిరి. పంచాయితీలకు సలహా చేయు ఉద్యోగి పెక్కు పంచాయతీల కొకరిని నియమించవచ్చు కాని, ప్రతి పంచాయతీకి ఒక కార్యనిర్వాహకోద్యోగిని నియమించ నవసరం లేదనిరి.

కాసు బ్రహ్మానందరెడ్డిగారు, సెలక్టు కమిటీ బాగుగ ఆలోచించియే 500 కనీస జనసంఖ్యగా నిర్ణయించెననియు, కాంగ్రెసుపార్టీగూడ యీవిషయం ఆలోచించి మార్చరాదనెననియు తెలిపిరి. జేకపరిపాలనకు గ్రామమే మూలంగా (యూనిటు) యుండాలని కాంగ్రెసు నిర్ణయించెను. ప్రస్తుత చట్టంలో గూడ 1000 కనీస సంఖ్యగా నిర్ణయించబడినది. కనుక 500 యిపుడు నిర్ణయించుట గొప్ప మార్పు కాదు. పంచాయితీ అన్న మాటలోనే అన్ని భావములందు ఐదుగురు గల పాలక వర్గమని ఒక్క గ్రామమని సూచనగలదు. కనుక మూడునాలుగు గ్రామాలను కలుపుట అన్యాయమగును. 4000 గల గ్రామానికి 1000 గల గ్రామం చేర్చి ఒక పంచాయతీ చేసినచో చిన్న గ్రామానికి ఎప్పుడూ ప్రాతినిధ్యం లభించదు. రెండుగ్రామాలను కలిపినచో రెండు గ్రామాలందున్న ఐకమత్యము చెడిపోవును.

డి. వి. రామస్వామిగారు, గ్రామాలందు యిపుడు పూర్వముండిన ఐకమత్యము సుఖజీవనము చెడిపోయినాక గ్రామ పునరుద్ధరణం చేయుచున్నాము. కనుక అధిక సౌష్ఠవం గల యింతుక పెద్ద గ్రామాలకు పంచాయతీ లేర్పరుచాలి గాని ఏమిలేని ఈ గ్రామాలందు పంచాయతీలు నిరుపయోగమనిరి.

శ్రీ శివర్తి వెంకట సుబ్బయ్య గారు మాట్లాడుచూ ఒక గ్రామమునకు మరొక గ్రామమునకు తేడావుంటుంది. ప్రజలస్వభావములు వేరుగావుంటాయి. చట్టములో ఎక్కడా 500 లకే పంచాయతీ నీవుండాలని లేదు, విశ్వనాథముగారి సవరణ అంగీకరించిన రాష్ట్రములో కొన్ని ప్రాంతములలో పంచాయితీలు ఏర్పడే అవకాశము వుంటుంది గ్రామముఖ్యయం సంపూర్ణముగా వుంచవలెనని రివిన్యూగ్రామమున కొక పంచాయతీ వుంచవలెను. గ్రామసమూహాములకు ఒక పంచాయతీ వుండవలెనను శ్రీ విశ్వనాథముగారి సవరణబిల్లు ప్రాతిపదిక ఉద్దేశ్యములకు భిన్నమనిరి.

శ్రీ కే. రాజారాం ప్రతి రివిన్యూ గ్రామమునకు పంచాయతీవుండుట అవసరమనిరి.

శ్రీ బద్దెపూడి వెంకటనారాయణగారు శ్రీ విశ్వనాథంగారి సవరణను వ్యతిరేకించుచూ మంత్రిగారు పల్లెటూళ్ల స్వభావము తెలుసుకొనే 500 జనాభా గల గ్రామమునకు పంచాయతీని ఏర్పాటుచేశారు. గ్రామ గ్రామమునకు అవసరములు మారుతూ వుండును. కొన్ని గ్రామములను కలిపినప్పుడు పంచాయతీలు సరిగా పనిచేయుట లేదు. ప్రస్తుతము గ్రామములోని సహకార సంఘములనుకూడ ఏ గ్రామమునకు ఆ గ్రామమునకు విభజించవలెనని కోరుతున్నారు. పంచాయతీల సక్రమనిర్వహణ ఆదాయమును బట్టిగాని, సిబ్బందిని బట్టిగాని కాదు గ్రామస్థుల తత్వమునుబట్టి చేసిననిర్ణయమును అమలుజరపవలెనని కోరుతున్నాను.

మంత్రిగారు జవాబు ఇచ్చుచు ఈ సవరణను ఆమోదించిన శతాబ్దముల తరబడిగా బ్రిటిష్‌వారు సహితము నాశనము చేయజాలని గ్రామ సంఘీభావము చెడిపోవుననిరి. కావున సవరణను వుపసంహరించుకొన వలసినదిగా కోరుచున్నాననిరి.

శ్రీ విశ్వనాథంగారు; మామూలు పరిస్థితులలో మంత్రిగారి మాటవిని సవరణను వుపసంహరించుకొనే వాడిని కాని గ్రామములను గ్రూపులు చేయు పద్ధతి ఎల్లాగో వుంది కాబట్టి 500 లకు 5000 లకు పెంచమని మాత్రము అన్నాను. పట్టణ ప్రజలదయా భిక్షమునకు గ్రామములను వదలజాలనని మంత్రి గారన్న మాటను మాత్రము అంగీకరించను. చిన్న పంచాయతీలు సెక్షన్ 51 లో చెప్పినపనులను నిర్వహించలేదు. ప్రభుత్వ సహాయం తప్పదు. బహుశా ఈ విషయం మంత్రి గారికి తెలియదేమో ఈ పద్ధతివలన గ్రామములు పట్టణములుగా మారుననిరి. శక్షన్ 51 తీసివేసిన నేను మంత్రిగారితో ఏకీభవించెదను చట్టములోని విధులను నిర్వహించుటకు అనుకూలముగా పంచాయతీలను ఏర్పరచవలెననిరి. మంత్రిగారి ఆశయములు ఈ బిల్లు వలన నెరవేరుట లేదనిరి.

స్థానిక పాలన మంత్రి గ్రామములను కూటములుగా చేయుటకు అవకాశ మివ్వవలెనని ఉద్దేశ్యమనిరి. శ్రీ విశ్వనాథంగారి సవరణ వీగిపోయినందున ఒరిజినల్ క్లాజు అంగీకరించబడెను.

శ్రీ కోటిరెడ్డి గారు క్లాజు 7 కి సవరణ ప్రతిపాదించుచు రహస్యపు ఓటింగు పద్ధతిని అమలు జరుపవలెననిరి.

శ్రీ పైడా వెంకట నారాయణ గారు సవరణ బలపరచిరి.

నేను సవరణ సిద్ధాంతమును అంగీకరించుచున్నాను నియమములలో చేర్చగలమని చెప్పిరి.

శ్రీ కాశీశ్వరరావు గారు మాట్లాడుచు సవరణలోని అంతరార్థమును అంగీకరించితిమని మంత్రి గారు చెప్పినందుకు సంతోషము, అయితే నియమములు మరల అసెంబ్లీకి రావలెనను నిర్బంధము లేదు. గనుక బిల్లులోనే చేర్చి అనుమానమును తొలగించవలెననిరి.

చిన్న పంచాయతీ ఎన్నికలకు రహస్య ఓటింగు పద్ధతి సిఫార్సు చేయదగినది కాదని విశ్వనాథంగారనిరి.

మంత్రిగారు ఎల్లకాలము మంత్రిగా వుండగలనని హామీ ఇస్తే సవరణను ఉపసంహరించుకుంటాననిరి.

శ్రీ కోటి రెడ్డి గారు సవరణను వుపసంహరించుకొనగా మొదటి క్లాజు అంగీకరించ బడెను.

అసెంబ్లీ జనవరి 5 తేదీకి వాయిదా వేసినట్లు ప్రకటించిరి.

## రేడియో ద్వారా హిందీ పాఠాలు

మదరాసు రేడియోద్వారా 19 వ తేదీ నుండి ఉదయం 8-30 గం. నుండి 20 నిముషాలు హిందీపాఠాలు తెలుగులోను అరవంలోను చెప్పుతున్నారు. సోమవారంనుండి శుక్రవారం వరకు వారానికి 5 రోజులుండును. 13 వారాలవరకు 65 పాఠాలు జరుగును. ప్రారంభ దినమున విద్యా మంత్రి కే. మాధవ మీనను గారు, యీ పాఠాలు సెకండరీ విద్యాలయములందు విద్య నేర్చుకొను వారికి సరియగు ఉచ్చారణ నేర్చుకొనుటకు, హిందీ వ్యాప్తికి తోడ్పడ గలవని చెప్పిరి.

### రేడియో ప్రదర్శనం

మదరాసులో ప్రాత మదరాసు క్లబు హౌసు రోడ్డు (మవ్బ్రేటురోడ్డు) 23 వ తేదీన గౌ॥ పి. ఎస్. కుమారస్వామి రాజా, ప్రధానిగారు రేడియో వర్తక సంఘంవారు యేర్పాటు చేసిన రేడియో ప్రదర్శనము 4గం. లకు తెరచెదరు.

దాని వృత్తాంతము ఆ రాత్రి 7-30గం. మదరాసు, తిరుచి, విజయవాడ రేడియోల ద్వారా వినిపించబడును.

# హాలెండ్‌తో ఐక్య ఇండోనీషియా మైత్రి

## ముఖ్యాశయమని డా॥ హట్టా ప్రకటన

బటేవియా, డిసెంబర్ 20: "హాలెండుతోనూ, ఇతర దేశాలతోనూ స్నేహ సంబంధాలను దృఢపరచుకొనటంమా ముఖ్యాశయాలలో ఒకటి. అంతరంగిక వ్యవహారాలలో ప్రజానీకపు దుస్థితిని తొలగించి సాంఘిక న్యాయాన్ని చేకూర్చటమే మా ముఖ్యవిధానం" అని సంయుక్త ఇండోనీసియా ప్రథమ ప్రధాని డా॥ హట్టా నేడిక్కడ ప్రకటించాడు. తన నూతన మంత్రివర్గంలోని ఆరుగురు ప్రముఖులతో ఇతడీ వేళనే ఇక్కడికి వచ్చాడు.

సంయుక్త ఇండోనీసియాకు స్వాతంత్ర్యమిస్తూ హాలెండ్ రాణి జూలియానా ఇవ్వనున్న దానపత్రాన్ని స్వీకరించే నిమిత్తం ఆయుగురు సహచరులతో కలిసి 23 వ తేదీన హేగ్‌కు బయలుదేరుతున్నానని హట్టా వెల్లడించాడు.

అధికార ప్రకటన డిసెంబర్ 27 వ తేదీన ఒకేసారిగా హేగ్, జోగ్జకర్తా, బటేవియాలలో వెలువడుతుందని భావించబడుతున్నది. సంయుక్త ఇండోనీసియా తరఫున రక్షణమంత్రి హామేంకు బువనో (జోగ్జకర్తా సుల్తాన్) బటేవియాలో అధికారాన్ని స్వీకరిస్తాడు.

రిపబ్లికన్ సేనలు డచ్చి ఆక్రమణకు తరువాత మొట్టమొదటి సారిగా నేడు బటేవియానగరంలో బహిరంగంగా విన్యాసాలుజరిపి డా॥ హట్టా, జోగ్జకర్తా సుల్తాన్, తదితర నాయకులకు సైనిక గౌరవం చూపినవి.

ఇండోనీసియా అధ్యక్షుడు డా॥ సుకర్నో 28 వ తేదీన జోగ్జకర్తా నగరంలోకి అధికార హోదాతో ప్రవేశం చేస్తాడు.

## డచ్చిఎగువసభలో విమర్శ

హేగ్, డిసెంబర్ 20: ఇండోనీసియాకు అధికారం అప్పగించటంజూలియానా రాణికి అవమాన కరమైన విషయమనీ, డచ్-ఇండోనీసియన్ సమాఖ్య అధిపతిగా ఆమెకివ్వబడిన హోదా రాజరికాన్ని భగ్నంచేస్తున్నదనీ నేడు డచ్చిపార్లమెంటు ఎగువసభలో క్రిస్టియన్-హిస్టారికల్ పార్టీ సభ్యుడు పాల్లెమా విమర్శించాడు.

# రాజకోట పోలీసు ఉద్యోగుల హత్య

## బందిపోటు ముఠా దారుణ చర్య

రాజకోట, డిసెంబరు 20: రాజకోట సంస్థానానికి చెందిన ఒక పోలీసు ఇన్‌స్పెక్టరు, ఇద్దరు హెడ్‌కానిస్టేబుళ్లు కొంతమంది బందిపోటుచేత హతులైనారు.

ఈ సంఘటన హాలార్ జిల్లాలోని దనిధర్ గ్రామంలో జరిగింది. రాజకోటకు ఇది 80 మైళ్ళ దూరంలో వుంది.

ఈ ప్రాంతంలో బందిపోట్ల ముఠా తిరుగుతున్నదన్న వార్త తెలిసినమీదట పోలీసుపటాలం అక్కడకు పోయింది. వారు అక్కడికి చేరగానే బందిపోట్లు వారిని హఠాత్తుగా ముట్టడించి తుపాకులతో కాల్చారు. అందుకు ఫలితంగా ఈ దారుణమైన హత్యలు జరిగాయి.

దెబ్బలు తగిలిన మరి కొంతమందిని హాస్పటల్‌కు చేర్చారు.

# మానవజాతిని వినాశంనుండి తప్పించగలవి సత్యం అహింస మాత్రమే

## లక్నో విశ్వవిద్యాలయ పట్టభద్రులకు డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారి హితవు

లక్నో, డిసెంబరు 20: "అటంబాంబు అను ఘోరమారణాస్త్రమును కనిపెట్టుట వల్ల మానవజాతి నాశమైపోవుస్థితి యేర్పడినది. ఈ స్థితినుండి మానవకోటిని తప్పించగలవి గాంధిమహాత్ముని సాధనములను సత్యము అహింసమాత్రమే", అని రాజ్యాంగపరిషదధ్యక్షులగు డా॥ రాజేంద్రప్రసాద్ గారు లక్నో విశ్వవిద్యాలయపట్ట ప్రధానోపన్యాసము గావించుచు ప్రకటించిరి. "భౌతిక సంపదలతో సుఖముగాన లెనను కాంక్షవల్లనే వివిధజాతులవారి మధ్య సంఘర్షణ లేర్పడుచున్నవి. మానవులు భౌతిక సుఖకాంక్షను విడనాడి ప్రాచీన భారత సంప్రదాయములకును, సంస్కృతికిని అనుగుణముగా ఆధ్యాత్మికనిరతిని, త్యాగనిరతిని, సేవానిరతిని అవలంబింపవలెను. భారతదేశవిద్యావిధానము ఈ మహోదాశయ పూరితమై యుండవలెను" అని డా॥ రాజేంద్రప్రసాద్ గారు ఉద్బోధించిరి.

రాజేంద్రబాబు అస్వస్థులుగా నుండుటచేత లక్నో విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులగు ఆచార్య నరేంద్ర దేవ్ గారు వారి ఉపన్యాసమును చదివిరి. 1659 విద్యార్థులు పట్టములు పుచ్చుకొనిరి. వీరిలో 202 బాలికలు కలరు.

### యుద్ధభీతి ప్రపంచమును ఆవరించినది

"సంఘర్షణ జ్వాలలు యావత్ ప్రపంచమును ఆవరించియున్నవి. అమెరికా మువారును, రష్యనువారును యుద్ధమునకు సంసిద్ధులగుచున్నారు. వారిని భయమావహించినది. ఉపద్రవకరమైన ఈ స్థితినుండి మానవకోటిని తప్పించుట ప్రతిమానవుని విధ్యుక్తధర్మమై యున్నది వివిధదేశముల జీవితాశయములు కలంకితమగుటచేతనే యుద్ధభయము యావత్ ప్రపంచమును ఆవరించినదని వాదృచనమ్మకము. శాంతి, సుఖము యొక్క నిజస్వరూపమును అందరు మరచిపోయిరి. ఈస్థితి భోగకాంక్షఫలితమే గాని అన్యముకాదు. ప్రపంచమునకు యిది మహానర్థహేతువు ఈ కాంక్ష అన్ని దేశములలోను, అన్ని కాలములలోను వుండెను. కాని మానవులను అభివృద్ధికాములను గావించినది ప్రేయముకాదని, శ్రేయమని మన మెన్నడును మరువరాదు. మానవ సంఘము ప్రస్తుత క్షుద్ర పశుత్వమునుండి ఈ తీవ్రము కానలసిన యెడల నది సంకుచిత జాతీయతత్వమును విడనాడి సార్వాత్మభావమును చేపట్టవలెను. మానవుని బుద్ధిపరిణామమునకు, సంస్కృతి పరిణామమునకు సంబంధించిన మానవ నాగరికతా చరిత్ర యందలి ప్రతిపుట మానవ జీవితమునకు అత్యంత ప్రధానమైనది త్యాగమని, సేవయని చాటుచున్నది.

పూర్వము మన ఋషులు అద్వైతభావమును- సార్వాత్మ భావమును మనకు బోధించిరి. ఈ యుగములో మన సారథి, మన గురువు నైన గాంధిమహాత్ముడు ఈ సార్వాత్మ్య భావమునే బోధించెను. ఇట్టి ఆశయములు కలవగుటచేతనే ప్రపంచమునందలి వివిధ దేశములు భారతదేశమును గౌరవించుచున్నవి. ఈ యుగపు భౌతిక సంపదలపై వ్యామోహము కలవారగుటచేత భౌతిక దశములో కొందరు బలము సంపాదించుటయే భోగముల ననుభవించుట జీవితలక్ష్యమని, సేవానిరతి జీవిత లక్ష్యము కాదని చెప్పుచుండుట సంతాపకరము. పశుబలమోపాసన, ద్రవ్యోపాసనమునకై ఉద్దేశింపబడలేదు. మన దేశమునకై ఉద్దేశింపబడలేదు. ఇట్టి ఉపాసన మానవకోటికి సుఖము కలిగించదు. మీరు మిట్లు నొల్పుచున్న భౌతికాభివృద్ధినుండి మనము మన దృష్టులను మరల్పవలసియున్నది. ఇట్లనుటవల్ల నవీన శాస్త్రజ్ఞానమువల్ల కలుగు లాభములను మనము పొందరాదని నా ఉద్దేశ్యమైనట్లు తలపరాదు." అని డా॥ రాజేంద్రప్రసాద్ గారు చెప్పిరి.

### నాల్గుమూల స్తంభములుకల రాజ్యాంగ విధానము

ఇటీవల ఆమోదింపబడిన భారత రాజ్యాంగ విధానముపైన పేర్కొనబడిన ఆశయములపైననే ఆధారపడియున్నదని డా॥ రాజేంద్రప్రసాద్ గారు చెప్పిరి. "నూతన భారత రాజ్యాంగ విధానము రిపబ్లికన్ విధానము ననుసరించుచున్నది. స్వేచ్ఛ, సమానత్వము, సోదరభావము, న్యాయముఅను నాల్గుమూల స్తంభములపై నది ఆధారపడుచున్నది." ఈ ఆశయములను మనము ఆచరణలోనుంచినప్పుడే సంపూర్ణముగు ప్రజాసత్తాక రాజ్యమేర్పడగలదు. విశ్వవిద్యాలయములు విద్యార్థికులను జనసామాన్యమునుండి దూరముచేయు సంస్థలుగాక, నిజమైన సరస్వతీ పీఠములైనప్పుడే ఈ ఆశయములు వ్యాప్తిగాంచగలవు. ఇతరుల హక్కులను గౌరవించుటయనునదిమరియొక ప్రధాన ప్రజాసత్తాక సిద్ధాంతము ఈ ప్రధాన సిద్ధాంతము గ్రంథస్థమై యుండుటమాత్రముచాలదు. ప్రజలు దానిని గుర్తించి, దానిని అమలుచేసినప్పుడే భారతదేశమునకు బలముకలుగును. రక్షణ యేర్పడును.

### భాషాసమస్య

స్వాతంత్ర్య సిద్ధివల్లనకు నూతనబాధ్యత లేర్పడినవని డా॥ రాజేంద్రప్రసాద్ గారు చెప్పుచు భారతదేశ విద్యావిధానము సరియైనదిగా నున్నప్పుడే ప్రజలు ఈ బాధ్యతలను చక్కగా నిర్వర్తింపగలరనిరి. ఈ సందర్భమున వారు భారత విశ్వవిద్యాలయ కమిషనుసలహాలను విద్యార్థులదృష్టికి దెచ్చిరి. బ్రిటిష్‌పరిపాలనా సమయమున ఆంగ్లమునకు విశేషప్రాముఖ్యమొసంగబడెనని, ఆంగ్లము ద్వారానే విద్యాబోధ జరుగుచుండెనని ఆయన చెప్పెను ఇందువల్ల దేశభాషలు అభివృద్ధికి అవకాశము లేకపోయెనని, ఆంగ్ల భాషా వ్యాసనముతో ఆంగ్ల సంస్కృతి, భావములు ప్రబలెననిరి. ఆంగ్లభాషను నేర్చుకొనుటలో తప్పేమియు లేదని, ప్రపంచములో చాలా మంది ఆంగ్లభాష మాట్లాడు వారగుటచేత ఆంగ్లము నేర్చుకొనుట అవసరము గూడనని డా॥ రాజేంద్రప్రసాద్ గారు చెప్పుచు ఆంగ్లభాషద్వారా విద్యాబోధ గావించుట ఆక్షేపణీయమనిరి. ఇప్పుడు చాలా రాష్ట్రములలో స్కూలుఫైనలువరకు విద్యాబోధ దేశీయభాషలో జరుగుచున్నదని ఆయన చెప్పుచు ఈపద్ధతిని పూర్తిగాప్రవేశపెట్టని వారు ద్వరలో ప్రవేశపెట్టెదరని ఆశించిరి. విశ్వవిద్యాలయ విద్యలో కొలది విశ్వవిద్యాలయములు తప్ప తక్కినవన్నియు ఆంగ్లముద్వారా విద్య బోధించుచున్నవనిరి. సంస్కృతమును, దేశభాషలను సైతము ఆంగ్లములో బోధించుచున్నారనిరి. కాళిదాసు, తులసీదాసుల కవితా వైభవమును ఆంగ్లములో వ్యాఖ్యానముచేసి చెప్పుస్థితి యేర్పడినదనిరి. ఈ వైపరీత్యములను మనము సహించియుంటిమి. మనమనస్సులపైనను, హృదయములపైనను విదేశభాషా ప్రాబల్యమెంతగా నుండెనో ఈ విషయము వ్యక్తము చేయుచున్నది,' అని డా॥ రాజేంద్రప్రసాద్ గారనిరి. విశ్వవిద్యాలయ కమిషను సలహాలు సంతృప్తికరముగా నున్నవని రాజేంద్రప్రసాద్ అనెను. ఉన్నత విద్యను ఆంగ్లభాష ద్వారా బోధింపరాదని, ఆంగ్లభాషస్థానమును మాతృభాషలేక ప్రాంతీయ భాష ఆక్రమించవలెనని ఆయన చెప్పెను.

భారతదేశ వైజ్ఞానికైక్యమును రక్షించుటకును ఒక విశ్వవిద్యాలయ విద్యార్థులు మరియొక విశ్వవిద్యాలయమునకు వెళ్లగలుగుటకునుగాను ఉన్నతవిద్యను జాతీయ భాషద్వారా నేర్పవలెనని కొందరు విద్యాబోధనా వేత్తలు అభిప్రాయపడుచున్నారు. నా అభిప్రాయమేమనగా, అత్యున్నత తరగతి రకు తన మాతృభాషలోను, లేదా ప్రాంతీయ భాషలలోను విద్యనేర్చుకొను హక్కు ప్రతి విద్యార్థికిని కలదు. ఇది సాధ్యము గూడను. ఎందువల్లననగా రాష్ట్రీయ భాషలు బాగా అభివృద్ధియైనవి. ఏవిద్యార్థియైనను, ఏదో ఒక విషయమునుగాని, అన్ని విషయములనుగాని జాతీయభాషలో నేర్చుకొనగోరెయెడల అందుకు అవసరమైన సౌకర్యములు కల్పించవలెను. కాని ఉన్నత విద్యాదశలో జాతీయభాషను నిర్బంధ భాషగా చేయుట తప్పు. జాతీయభాష ఒక రాష్ట్రీయువారు మరియొక రాష్ట్రీయువారితో సంభాషణ జరుపుటకు ఉపయోగపడు భాషయని రాష్ట్రీయ భాషల స్థానమును ఆక్రమింపగూడదని మనము స్పష్టము చేయవలెను.

ఉన్నత విద్యాదశలో ప్రాంతీయ భాషద్వారా విద్యను బోధించిన యెడలను, అంతర్రాష్ట్ర సంభాషణాదికమునకు జాతీయ భాషాబోధను నిర్బంధము చేసిన ఎడలను యెవ్వరికిని ఆక్షేపణ యుండదని నమ్ముచున్నాను అని చెప్పిరి.

15 సంవత్సరములలోపుగా కేంద్రశాఖలన్నిటిలోను వ్యవహారములు హిందీలో జరుగనుండుటచేత విశ్వవిద్యాలయములు త్వరగా మాతృభాష, హిందీలలో బోధన ప్రారంభించవలెనని డా॥ రాజేంద్ర ప్రసాద్ గారనిరి. దేశీయ భాషలలో బోధన గావించు వారు విశ్వవిద్యాలయములో లేనియెడల 15 సంవత్సరములలోపుగా ప్రభుత్వ కార్యాలయములనుండి ఆంగ్లమునకు ఉద్వాసన చెప్పుట అసాధ్యమనిరి. రాష్ట్రీయ ప్రభుత్వ కార్యాలయములలో ప్రాంతీయ భాషద్వారా వ్యవహారములు జరుగవలెనని శ్రద్ధ మనము జ్ఞాపకముంచుకొనవలెనని ఆయన చెప్పుచు సం॥ రా॥ములు బీహారు, సి. పి. మధ్యభారత, రాజస్థాను హిందీని రాజభాషగా ప్రకటించెనని, ఈ ప్రాంతముల విశ్వవిద్యాలయములు వెంటనే ఆంగ్లమును తొలగించి దాని స్థానే హిందీ ద్వారా విద్యాబోధ చేయుటవసరమని చెప్పిరి. ఇట్లు కానిచో హిందీలో వ్యవహారము నడుపు లక్షీకార్లు మనకెట్లు లభ్యమగుదురు, అని యడిగిరి.

జనపదులకు ప్రాతిపదిక విద్య ద్వారానే విద్యాబోధ చేయవలెననిరి.

ప్రాచీన భారతీయ మహావాశయముల నాధారము చేసికొని విశ్వవిద్యాలయములు విద్యను మార్చవలెనని, స్వతంత్ర భారతదేశములో విద్య పూర్వ సంప్రదాయములకు, సంస్కృతికి అనుగుణముగా నుండవలెనని వారు చెప్పిరి. మన విశ్వవిద్యాలయములు భారత సంస్కృతికి సజీవములగు కేంద్రములుగా నుండవలెననిరి. "2½ సంవత్సరముల క్రిందట మనకు స్వాతంత్ర్యము చేకూరినప్పటికి దేశములో నీతి, ధర్మము, త్యాగము మృగ్యముగా నుండుట సంతాపకరము. విశ్వవిద్యాలయములలో ఆచార్యులు శీలసంపత్తికలవారుగా నుండవలెను. పూర్వకాలములో గురువులకును శిష్యులకును మధ్యవుండిన సంబంధము ఆధ్యాత్మికమైనదిగా నుండెను. గురువులు శీలసంపత్తి త్యాగనిరతి కలవారై, శిష్యులను శీలసంపత్తికలవారినిగాను, స్వార్థత్యాగులనుగాను చేయుచుండిరి. మన విశ్వవిద్యాలయాచార్యులుగూడ యిట్టివారుగా నుండవలెను అని చెప్పుచు డా॥ రాజేంద్ర ప్రసాద్ గారు ఉపన్యాసమును సమాప్తము గావించిరి.

# తిరుపతి దేవస్థానం కమిషనర్ పదవి

తిరుపతి, డిసెంబరు 20: తిరుమల తిరుపతి దేవస్థానం కమిషనరు బి. వీరాస్వామి నాయుడుగారు ఒకనెల సెలవు అనంతరం ఈ నెల 16 న తిరిగి పదవి స్వీకరించవలసివుండెను. కాని ప్రభుత్వం నాయుడుగారిని మరల సెలవిచ్చి శాఖకు మార్చుకొంటామని తెల్పినందుచేత తాత్కాలిక కమిషనర్‌గా నియమింపబడిన సి. అన్నారావుగారే ఆ పదవిని నిర్వహిస్తున్నారు. (స్వ. వి.)

# "ఆటంబాంబుల ఉత్పత్తిని మొదట నిషేధించండి"

## అగ్రరాజ్యాలకు రోమ్యులో విజ్ఞప్తి

లేక్‌సక్సెస్, డిసెంబరు 20 : "ఆటంబాంబుల ఉత్పత్తిని తాత్కాలికంగా నయినా నిషేధిస్తూ ఒక ఒడంబడికను సాధించటానికి మీరు మొదట ప్రయత్నించండి." అని ఐక్యరాజ్యసమితి అధ్యక్షుడు జనరల్ కార్లోస్ రోమ్యులో నేడు ఆరు అగ్రరాజ్యాలకూ విజ్ఞప్తి చేశాడు.

అణుశక్తి కంట్రోలు విషయమై ఐక్యరాజ్యసమితి కిందటి సమావేశంలో చేసిన తీర్మానాన్ని ఆచరణలో పెట్టే మార్గాలను పరిశీలించే నిమిత్తం నేడు మొదటిసారిగా సమావేశమయిన అమెరికా, బ్రిటన్, కెనడా, ఫ్రాన్సు, రష్యా, చీనా ప్రతినిధులకు రోమ్యులో పై విధంగా విజ్ఞప్తి చేశాడు. ఈ సమావేశానికి అధ్యక్షతవహిస్తున్న కెనడా ప్రతినిధి మెక్నాటన్‌కి ఆయన ఒక లేఖను వ్రాస్తూ తాత్కాలికంగానైనా ఆటంబాంబు ఉత్పత్తిని నిషేధించటానికి సమావేశం ప్రయత్నించాలనీ, అయితే తాను ఒక ప్రత్యేకమార్గాన్ని సూచించదలచలేదనీ తెలియజేశాడు.

అయితే తాను లోగడ ఈ కింది నాల్గు సూచనలను చేశానని మాత్రం రోమ్యులో తన లేఖలో ఉదహరించాడు :

(1) ఆటంబాంబుల వుత్పత్తిని నిషేధిస్తూ తాత్కాలిక ఒడంబడిక చేసుకొనటానికి మొదట ప్రయత్నించాలి. వాటి ఉత్పత్తిలో జరుగుతున్న భయంకరమైన పోటీ వల్ల ఈ సూచన ముఖ్యంగా చేయవలసి వచ్చింది.

(2) కొంత కాలం పాటు ఉభయ పక్షాలూ తమ సన్నాహాలను కట్టిపెట్టి తమ దగ్గరున్న ఆటం ఆయుధాల వివరాలను పరిశీలించే సంస్థను నెలకొల్పాలి.

(3) అణుశక్తి కంట్రోలుకు ఉభయ పక్షాలు ప్రతిపాదించిన పథకాలను మరింత సమన్వయం చేయాలి.

(4) ఆటంఆయుధాలన్నిటినీ తాత్కాలికంగా నిషేధిస్తూ, తగిన రక్షణలు ఏర్పాటు చేయాలి.

ప్రతినిధులు నేటి సమావేశం అయిన తరవాత ఒక ప్రకటన చేస్తూ, సమితి తీర్మానాన్ననుసరించి సమావేశ ఫలితాలు ఎప్పటికప్పుడు ప్రకటించబడుతూ ఉంటవని తెలియజేశారు.

## మంత్రులపై ఆరోపణలు ఆధార రహితములు

### అసెంబ్లీలో మంత్రిగారి జవాబు

మదరాసు, డిసెం 21 :—నేడు అసెంబ్లీ స్పీకరు శ్రీ శివషణ్ముగంపిళ్లె అధ్యక్షత క్రింద సమావేశమైనప్పుడు జనాబ్ యం. ఏ. సలాం కొంతమంది మంత్రులపైగల ఆరోపణలు గురించి న్యాయ విచారణ జరిపించుటకు వుత్తర్వు చేసిన అభ్యంతరమేమైనా యున్నదాయని కేంద్ర ప్రభుత్వము ఈ ప్రభుత్వమునకు వ్రాసిన మాట వాస్తవమేనాయని అడిగిరి.

ప్రశ్నకు బదులు సభానాయకుడు శ్రీ గోపాలరెడ్డిగారు అటువంటి వుత్తరమేమీ రాలేదని జవాబు ఇచ్చిరి.

రజాకాన్ :—ఇండియా ప్రభుత్వమూ కాంగ్రెసు కార్యవర్గము విచారణ అవసరము లేదని తలచినమాట నిజమేనా ?

స :—ఇందులో ఇండియా ప్రభుత్వ ప్రసక్తి లేదు.

ప్ర :—ఆరోపణలు నిరాధారములని ప్రజలకు తెలుపుటకైనా ఈ ప్రభుత్వమైనా విచారణ జరిపించుట మంచిదిగదా ?

స :—విచారణ సంఘమును నియమించవలసిన అవసరము ప్రభుత్వమునకు లేదు. ఆరోపణలు ఆధారరహితమని ప్రభుత్వ అభిప్రాయము.

### క్వీన్‌మేరీ కళాశాల ఆవరణలో లాఠీచార్జి

మదరాసు, డిసెంబరు 21 : క్వీన్‌మేరీ కళాశాల ఆవరణలో లాఠీచార్జి అసలు లేదు కాని ప్రదర్శనము చూచుటకు వచ్చిన ప్రేక్షకులు కొంతమంది విద్యార్థులను కళాశాల ఆవరణనుండి బయటకు పంపవలసి వచ్చినది. కొంతమంది విద్యార్థులు ఒక అల్లరి పిల్లవాడిని పట్టుకొన్న పోలీసు తమ మార్పుగా ఇవ్వవలెనని నిష్కారణముగా ఆందోళన చేసిరి, రాళ్లు విసరుటవలన ప్రదర్శనము ఆపుజేసి పోలీసుల సహాయముతో జనమును పంపివేయవలసివచ్చినదని విద్యామంత్రి మాధవమీనను నేడు అసెంబ్లీలో శ్రీ తెన్నేటి విశ్వనాధముగారి ప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

విచారణ అనంతరము విద్యార్థులు ఆవేశముతో అల్లరి చేసియుండవచ్చునని భావించి ప్రభుత్వము విద్యార్థులపై గల క్రిమినల్ చర్యను ఎత్తివేయవలెనని వుత్తర్వు చేయబడినదని కూడ తెలిపిరి.

శ్రీ వి. యస్. మూర్తి. విద్యార్థినులకు కూడ లాఠీప్రయోగము అయినదా?

స: లాఠీచార్జిలేదు.

శ్రీ స్వామినాధన్: విద్యార్థుల ఉద్రేకమునకు కారణమేమిటండీ.

స: కారణమేమిటో నేను చెప్పలేను.

### రాజకీయ బాధితులకు నగదు సహాయం

మదరాసు, డిసెంబర్ 21 : రెవిన్యూ మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు నేడు అసెంబ్లీలో రాజకీయ బాధితులకు నగదు సహాయము ఇవ్వబడదని జనాబ్ సలాంకు తెలిపిరి.

ఇస్మయిల్: ప్రభుత్వము కజిన్సు పతికి రాజకీయ బాధితులగనే రొఖము ఇచ్చియున్నది గదా?

స: ప్రత్యేక ప్రశ్న వేయండి. ఆకేసు వేరని అనుకుంటున్నాను.

### దివ్యజ్ఞాన సమాజం

దివ్యజ్ఞాన సమాజం 74 వ అంతర్జాతీయ సమావేశము కాశీలో ఈనెల 25వ తేదీన సి. జినరాజదాసాగారి అధ్యక్షతను జరుగును. నాటినుండి 31 వ తేదీంకు ప్రతిరోజు కళాప్రదర్శనములు వినోదములు జరుగును.

## స్త్రీజనాభ్యుదయశాఖ వార్షికోత్సవము

### విజయవాడలో ప్రదర్శనము

విజయవాడ, డిసెంబరు 18: స్త్రీ జనాభ్యుదయ (ప్రభుత్వ) శాఖయొక్క వార్షికోత్సవము.

నేటిసాయంత్రము గాంధీజీ మునిసిపల్ హైస్కూల్ ఆవరణలో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షత క్రింద జరిగెను. కృష్ణాజిల్లా సబ్ కలెక్టర్ శ్రీ శ్రీనివాసన్ ప్రదర్శనమునకు ప్రారంభోత్సవం జరిపిరి. సూపరింటెండింగ్ ఇంజనీర్ శ్రీ జి. ఎ. నరసింహారావు, స్త్రీ జనాభ్యుదయసలహా సంఘాధ్యక్షురాలు శ్రీమతి మద్దిశెట్టి, మున్నగు ప్రముఖులనేకమంది కార్యక్రమములో పాల్గొనిరి.

విజయవాడ అసిస్టెంట్ స్త్రీ రోగ క్షేమ శాఖాధికారిణి శ్రీమతి తులసి సుభద్ర వార్షికనివేదికను చదువుచూ, గృహిణులు తమ తీరిక సమయములలో ధనార్జనకు తోడ్పడు చిన్నచిన్న పనుల చేయవచ్చుననియు, అవిధముగా స్త్రీలు ఉత్పత్తిచేసిన వస్తువులకు రోగక్షేమశాఖ సాయపడి, తదుపరి అమ్మకపు ఏర్పాటు చేయుదురనియు ఈ ప్రదర్శనమట్టి ఏర్పాటే ననియు తెలియజేసిరి.

శ్రీమతి కొంచనపల్లి కనకాంబ, చేతిపనులలో నిపుణులుగా నిర్ణయింపబడిన స్త్రీలకు బహుమతుల నిచ్చిరి. జ్ఞాపకశక్తికి గూడా బహుమానము లివ్వబడినవి.

తదుపరి నృత్యగీతాది వినోదములు జరిగెను. గౌరవ ఫస్టుక్లాస్ మేజిస్ట్రేటు శ్రీ అప్పారావునాయుడు నాయకత్వముక్రింద భగవత్‌సింగ్ సేవాదళమువారు, కార్యక్రమ నిర్వహణలో తోడ్పడిరి. శ్రీమతి పద్మావతి వందనములతో ఉత్సవము ముగిసెను. (స్వ. వి.)

### పశుప్రదర్శనము

మదరాసు వెటర్నరీ కాలేజీలో 28 వ తేదీన రాష్ట్రీయ పశువైద్యుల మహాసభ 9 వ సమావేశము జరుగును. ఆ సందర్భమున సింధి, ఒంగోలు, తదితర రకముల ఆవులు పశువులు కోడెలు మొదలైన వాటి ప్రదర్శనం ఒకేనాడు జరుగును. తమ పశువులను ప్రదర్శింపదలచినవారు 28 తేది ఉదయం 8-30 గంటలకు వెపేరిలో కాలేజీవద్దకు తెచ్చిన సాయంకాలంవరకు మేతవేసి, ప్రదర్శనంలో బహుమతులిచ్చి, సాయంకాలం పంపివేయుదురు.

## చక్కెర మిల్లులలో పనిప్రారంభం

న్యూఢిల్లీ, డిసెంబర్ 20 : ప్రభుత్వ వర్తకసాయ మంత్రి త్వరగ్గ లభించుచున్న వివరాలను బట్టి, ఈనెల 19వ తేదీకి 111 చక్కెర మిల్లులు పని ప్రారంభించినట్లు తెలుస్తున్నది. అంటే దేశంలోవున్న మిల్లులలో నూటికి 83 మిల్లులు పని ప్రారంభించినాయి. క్రితం సంవత్సరం ఈ సరికి 69 మిల్లులకంటే ఎక్కువ తెరవలేదు. రాష్ట్రాలవారీగా, పనిప్రారంభమైన మిల్లుల సంఖ్య: సంయుక్తరాష్ట్రాలు 58 బీహారు, 25; బొంబాయి 12, ఇతరప్రాంతాలు 16.

## "ధాన్యంధర త్వరలోనే తగ్గిపోతుంది"

### ధాన్య సంఘాధ్యక్షుడు మైత్రా ప్రకటన

బొంబాయి, డిసెంబరు 19 : ధాన్య సంఘాధ్యక్షుడు పండిత లక్ష్మీకాంతమైత్రా ఈవేళ మాట్లాడుతూ త్వరలోనే ఆహార ధాన్యాదుల ధరలు తగ్గించబడగలవని తాము ఆశిస్తున్నామని అన్నారు.

ఈసంఘం నిన్న పూనానించి ఇక్కడికి వచ్చింది. వచ్చిన తరవాత ఈ సంఘ సభ్యులు అందరు వారొత్తుగా అనేకమైన ప్రభుత్వ ధాన్యాగారాలు పరిశీలించారు. ఆ తరవాత వీరు కొన్ని రేషనింగు దుకాణాలను గూడా పరిశీలించి ఇవన్నీ చాలా చక్కగా నడుస్తున్నాయనీ ధాన్యాదులు భద్రంగా సంరక్షింపబడుతున్నవనీ అన్నారు.

సాయంత్రం ఈ సంఘంవారందరూ బొంబాయి రేవులోని ధాన్యాగారాలు కూడా పరిశీలించారు.

ఆతరవాత పండితమైత్రా పి. టి. ఐ. విలేఖరితో మాట్లాడుతూ బొంబాయిలో ఆహార సరఫరా బాగానే జరుగుతున్నదనీ అయితే బియ్యం తగినంతగా దొరకడం లేదని జనం అంటున్నారనీ చెప్పారు.

ఈ సంఘంవారు బొంబాయి మంత్రి దినకరరావుదేశాయితో సంప్రతింపులు జరిపారట. ఈ సంప్రతింపులు ధాన్యంధరల తగ్గింపునుగురించి జరిగాయని తెలుస్తున్నది. దినకరరావుదేశాయి అక్కడక్కడ లేదా ఉండే ధరల తేడాలనుసరించి మాట్లాడుతూ పై దేశాలనించి ధాన్యందిగుమతి చెయ్యబడుతున్నదనీ, దానిధరల నిర్ణయం కూడా జరుగుతున్నదనీ, అందుచేత ధరలు తేడా తప్పవనీ అన్నారు.

పండితలక్ష్మీకాంతమైత్రా ఈవేళ రాత్రి ఢిల్లీకి వెళుతున్నారు.

## "కామన్వెల్తు సభకు బర్మాను ఆహ్వానించలేదు"

### ప్రభుత్వ ప్రకటన

రంగూన్, డిసెంబరు 20 :—జనవరిలో కొలంబోలో జరుగనున్న కామన్‌వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశానికి తన్ను ఆహ్వానించినమాట అబద్ధమని బర్మా ప్రభుత్వం నేడు ప్రకటించింది.

అదీకాక బర్మా విదేశాంగ మంత్రి ఈహూంగ్ అధికారపత్రికా విలేఖరులతో చెప్పి వుండలేదనిగూడా ఈ ప్రకటనలో వెల్లడించబడింది.

ఇండియన్ పత్రికలు ఆయన చెప్పినట్లు ప్రకటించడం చాలా అసంగతంగా వున్నదని ఆ ప్రకటనలో వివరించారు.

కాని ఆయన్ను ఢిల్లీలో కలుసుకొన్న పి. టి. ఐ. విలేఖరి బర్మా ప్రభుత్వం చేసిన యీ ప్రకటనను చూసి ఆశ్చర్యాన్ని వెల్లడిస్తూ, ఆయన తమతో అవిధంగా అన్నమాట నిజమేనని పునరుద్ఘాటించారు.

## "మైసూరుతో కూడిన కర్ణాటక రాష్ట్రం"

### యువకపరిషత్తు తీర్మానం

బెంగుళూరు, డిసెంబరు 19 : మైసూరు సంస్థానంలోని కాదూరు గ్రామంలో నిన్న కర్ణాటక యువకపరిషత్తు కార్యవర్గం వారు సమావేశమై, ఇటీవల జె. వి. పి. కమిటీని చెందిన నాయకులు మైసూరుతో కూడిన కర్ణాటకరాష్ట్రస్థాపన విషయమై చేసిన ప్రకటనలు పరస్పర విరుద్ధంగా ఉండి మైసూరులోని అభ్యుదయ నిరోధకుల స్వార్థానికి ఉపయోగపడ్డవని తీర్మానించారు.

మైసూరు కాంగ్రెసు వర్కింగు కమిటీ వారు, యువకపరిషత్తు, సర్వ పక్షసభ్యులూ నేకంవారూ అనేకపర్యాయాలు మైసూరు ప్రజాభిప్రాయాన్ని వ్యక్తపరచినారు. కనుక కేంద్రప్రభుత్వంవారు తక్షణమే కర్ణాటకరాష్ట్రాన్ని వ్యవస్థాపన చేయవచ్చునని, అట్లా చేయని పక్షంలో మైసూరులో తీవ్రపరిస్థితి ఏర్పడుతుందనీ యువకపరిషత్తువారు భావిస్తున్నారు.

## మలేరియా వ్యాధికి 11 లక్షల మంది బలి

న్యూఢిల్లీ, డిసెంబరు 20 : భారతదేశంలో మలేరియా వ్యాధివల్ల 1947 లో 10 లక్షల 66 వేల 269 మంది మరణించారని పార్లమెంటులో నేడు ఆరోగ్యశాఖా మంత్రిణి శ్రీమతి రాజకుమారీ అమృతకౌర్ ప్రకటించింది. ఇదే ఏడాదిలో వివిధ రాష్ట్రాలలో క్షయ వ్యాధి వల్ల 47,624 మంది, స్ఫోటకంవల్ల 24,507 మంది మరణించారని కూడా ఆమె అన్నారు.

## "జెరూసెలంకు ఇజ్రాయిల్ ప్రభుత్వపీఠం మార్చరాదు"

### ఐక్యరాజ్యధర్మకర్తృత్వసంఘ తీర్మానం

లేక్‌సక్సెస్, డిసెంబరు 21: ఇజ్రాయేలు ప్రభుత్వము తన ప్రభుత్వపీఠము తాలూకు కొన్ని డిపార్టుమెంట్లను టెలావీవు పట్టణమునుండి జెరూసలేము పట్టణమునకు మార్చుటకై కొన్ని వ్యవహార చర్యలను జరిపెను. ఈ వ్యవహార చర్యలను రద్దుచేసికోవలసినదిగా ఐక్యరాజ్యసమితి తాలూకు ధర్మకర్తృత్వమండలి నేడు తీర్మానించెను. తీర్మానమునకు అయిదుగురు అనుకూలంగా వోట్లు యిచ్చిరి. ప్రతికూలంగా ఎవరూ వోటు యివ్వలేదు. 7 మంది వోట్లుయివ్వక తటస్థంగా ఉండిరి. అయిదు అగ్రరాజ్యాలలోను ఫ్రాన్సు ఒక్కటిమాత్రం తీర్మానానికి అనుకూలంగా వోటునిచ్చెను.

ఇజ్రాయేలు ప్రభుత్వముయొక్క చర్య విషయములో ఆందోళన వెల్లడిస్తూ ఒక తీర్మానము మొదట ప్రతిపాదింపబడెను. దానికి యూజిప్టున్నూ ఇరాకున్నూ కలిసి ఒక సవరణ తీర్మానము ప్రతిపాదింపబడెను. ఈ సవరణ తీర్మానమే పైచెప్పిన రీతిగా ఆమోదింపబడిన తీర్మానరూపము దాల్చెను. బ్రిటను, అమెరికా, రష్యా, చైనా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు డొమినికను రిపబ్లికు తటస్థముగా నుండెను. ఈ సవరణ తీర్మానమునకు అనుకూలంగా బెల్జియం, ఫ్రాన్సు, ఇరాకు, మెక్సికో ఫిలిప్పయిన్సు వోటునిచ్చెను.

అయిక్యరాజ్యసమితి అసెంబ్లీ చేసిన తీర్మానమును ఇజ్రాయేలు ప్రభుత్వము నిర్లక్ష్యము చేసినదనే తీర్మానము మొదట ప్రతిపాదింపబడెను. ఇందుకు అనుకూలురు 9 మంది, ప్రతికూలురు లేరు. మగ్గురు వోట్లుయివ్వక తటస్థంగా ఉండిరి.

ధర్మకర్తృత్వ మండలి తిరిగి జనవరి 19 తేదీని జినీవాలో సమావేశమగుటకు సభ వాయిదా వేసెను.






Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.